# "నీ బోర్న్‌విటా త్రాగు, అమ్మా ... అది నీకు మంచిది"

## "దాని రుచి చాలా బాగుంటుంది కూడా"

**ఎందువలనంటే బోర్న్‌విటాలో ఇప్పుడు ఎక్కువగా కోకో ఉన్నది అందువలన ఇది అధిక రుచికరం అధిక ఆరోగ్యకరం.**

బోర్న్‌విటాలోని కోకో రక్తపుష్టినిచ్చే మాల్టుతో సమృద్ధమైనది. మరియు దానిలో విటమిన్ బి & డి మరియు కేల్షియం, ఫాస్ఫరస్, సోడియం మరియు పొటాషియం వంటి అమూల్యమైన ఖనిజ లవణాలు కూడా ఉన్నాయి. వీటికి తోడు బోర్న్‌విటా మాల్ట్, పాలు మరియు పంచదారల పోషకత్వపు గుణాలతో నిండియున్నది. వేడి నవ్వ పాలలో రెండు చెంచాలతో రుచికరమైన పోషకత్వం గల పానీయం తయారవుతుంది.

మీ పిల్లలకు ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వండి, రోజుకు రెండుసార్లు. వారి ఎదిగే శరీరాలకు అమూల్యమైన పోషకత్వం చేకూర్చేందుకు సహాయపడుతుంది. పైగా బోర్న్‌విటా అవసరం...వారికి తగ్గట్టుగా ఉండేందుకు!

Cadbury's
Bournvita
The ideal health drink for strength, vigour and taste
With More Cocoa tastier healthier
450 g net

**75 పైసలు ఆదా చేయండి.**

బోర్న్‌విటా మీకు 75 పైసలు ఆదాచేసే 450 గ్రాముల రీఫిల్ ప్యాక్‌లో కూడా దొరుకుతుంది. ఈ ప్యాక్ తెరవగానే దానిలోని పదార్థాలను వెంటనే మామూలు బోర్న్‌విటా డబ్బాలోనికి పోయండి. దాని తాజాదనాన్ని నిలిపేందుకు.

**క్రొత్త క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా**

**అధిక కోకో, అధిక శక్తి, అధిక రుచి**

OBM-6715 TL

### రా జీ నా మా లు !

ఎన్నికలు దగ్గరపడుతున్నకొద్దీ పలువురు ప్రముఖులు కాంగ్రెస్‌నుంచి వైదొలగడం కొందరు కాంగ్రెస్‌లో చేరడం ముమ్మరమవుతున్నది. రాష్ట్ర విధాన పరిషత్తు సభ్యురాలు— మాజీ మంత్రిణి శ్రీమతి టి. ఎస్. సదాలక్ష్మి కాంగ్రెస్ నుంచి వైదొలగి జగ్‌జీవన్‌రామ్ స్థాపించిన ప్రజాతంత్ర కాంగ్రెస్‌లో చేరారు. రాష్ట్రంలో జగ్‌జీవన్‌రామ్ పార్టీని సమర్థిస్తూ తొలిసారిగా కాంగ్రెస్‌ను విడచిన విధానమండలి సభ్యురాలు ఈమే. శ్రీ మూర్తిరాజు, కొండాలక్ష్మణ్ మున్నగు ప్రముఖులు రాజీనామా యిచ్చారు. శ్రీ లక్ష్మణ్ అధ్యక్షులుగా శ్రీ వి. పి. రాఘవాచారి ఉపాధ్యక్షులుగా, శ్రీమతి సదాలక్ష్మి, శ్రీ కె. రంగదాసు, శ్రీ ఏ. శ్రీరాములు ప్రధాన కార్యదర్శులుగా ప్రజాస్వామ్య కాంగ్రెస్ ఆంధ్రప్రదేశ్ శాఖ ఏర్పడింది. వచ్చే ఎన్నికలలో తాను ప్రతిపక్ష సభ్యులను బలపరచడం సహజం గనుక, రాజకీయ నీతి ప్రకారం శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధికారభాష కమిషన్ అధ్యక్ష పదవికి రాజీనామా యిచ్చారు. శ్రీ గోపాలకృష్ణయ్య రాజకీయ కురు వృద్ధులు. వయస్సు 71 సంవత్సరాలు. 1942 లో కాంగ్రెస్‌ను వదలి కమ్యూనిస్టులతో చేరారు. 1952 నుండి 1972 దా 20 సంవత్సరాలుపాటు రాష్ట్ర విధాన సభలో ఇండిపెండెంటు సభ్యులుగా ఉన్నారు. రాష్ట్ర గవర్నర్ శ్రీ భండారే గవర్నర్ పదవికి ఫిబ్రవరి 16 వ తేదీన రాజీనామా యివ్వడం వల్ల రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తి శ్రీ దివాన్ తాత్కాలికంగా గవర్నర్ పదవిని స్వీకరించడం, తాత్కాలిక ప్రధాన న్యాయమూర్తిగా శ్రీ ఆవుల సాంబశివరావు నియమితులు కావడం రాష్ట్రంలో ఏర్పడిన నూతన పరిణామం. శ్రీ భండారే బొంబాయి ఉత్తరమధ్య నియోజకవర్గం నుంచి లోక్‌సభకు పోటీ చేస్తారు. రాష్ట్ర నాయకులు ఫిబ్రవరి 16 సాయంకాలం బేగం పేట విమానాశ్రయంలో ఘనంగావీడ్కోలు యిచ్చారు.

## హైదరాబాద్ నోట్ బుక్

### రాష్ట్రపతి మరణంతో రాష్ట్రమంతటా విషాదం

రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీఅహమద్ (72) ఫిబ్రవరి 11 వ తేదీ ఉదయం 8.52 గంటలకు హఠాత్తుగా న్యూఢిల్లీలో మరణించడంతో దేశమంతటా విషాదచ్ఛాయలు అలముకున్నాయి. ఆంధ్రప్రదేశ్ కూడా విషాద సముద్రంలో మునిగింది. నగరంలోని కార్యాలయాలకు, విద్యా సంస్థలకు, సెలవు ఇచ్చారు. హోటళ్ళు, సినిమాలు, దుకాణాలు మూసి వేశారు. ప్రజాజీవితం ఎక్కడికక్కడే స్తంభించి పోయింది. గవర్నర్ శ్రీ భండారే ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు మున్నగువారు గాఢ సంతాపం ప్రకటించారు

### శ్రీమతి అమరేశ్వరి

న్యాయవాదిని శ్రీమతి కె. అమరేశ్వరి రాష్ట్ర ప్రధాన న్యాయస్థానంలో అదనపు న్యాయమూర్తిగా నియమితురాలు కావడంతో రాష్ట్ర ప్రధాన న్యాయస్థాన చరిత్రలో నూతనాధ్యాయం ప్రారంభమయింది ఈమె వయస్సు 47 సంవత్సరాలు. ఈమె ఫిబ్రవరి 14 న ప్రమాణస్వీకారం చేశారు. ఈమె 1949 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. బి. ఎల్. పట్టభద్రులయ్యారు. 1952 లో మద్రాసులో న్యాయవాద వృత్తిలో చేరారు. 1975 లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో ప్రభుత్వం ప్లీడరుగా నియమితులయ్యారు. 1976లో రాష్ట్ర హైకోర్టు అడ్వకేట్ల సంఘం ఉపాధ్యక్షురాలుగాను, భారత న్యాయవాదినుల సమాఖ్య రాష్ట్ర శాఖ ఉపాధ్యక్షురాలుగాను ఉన్నారు. ఈమె జన్మస్థలం గుంటూరు జిల్లా, అప్పికట్ల

### సరికొత్త నిఘంటువు

ఇదివరకు వున్న నిఘంటువులన్నీ సాహిత్యనిఘంటువులే. జన జీవితంలోని నిత్య వ్యవహార పదాలు మాండలికాలు వాటిలో చాల తక్కువ. కనుక ప్రపంచంలోని తెలుగు మాట్లాడే వారి కోసం ప్రత్యేకమైన నిఘంటువును తెలుగు అకాడెమీ చేపట్టింది. దీనిలో తెలంగాణా, సర్కారు, రాయలసీమ ప్రాంతాల గ్రామీణపదజాలం ఉంటుంది. ఆధునిక పదజాలానికి ఈ నిఘంటువులో ప్రాముఖ్యముంటుంది. అన్ని రంగాలవారికీ ఉపయోగించేట్టుగా దీనిని సిద్ధపరచనున్నామని తెలుగు అకాడెమీ డైరెక్టర్ శ్రీ వెంకటస్వామి ఫిబ్రవరి 12 న పత్రికా ప్రతినిధులకు తెలియజేశారు.

### వేదపండితుల పరిచయ పుస్తకం

సీతారామ్‌బాగ్‌లోని వేదవిద్యాచార్యపీఠం ప్రచురించిన 'వేదపండితుల పరిచయం' అనే ఆంగ్ల గ్రంథాన్ని శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణజియ్యరు స్వామి ఫిబ్రవరి 14 వ తేదీన ఆవిష్కరించారు. ఈ పుస్తకాన్ని ఇతర భాషలలోను అనువదించి ప్రకటిస్తామని ఆయన తెలిపారు. శ్రీ జియ్యరు స్వామి గుంటూరు జిల్లా నడిగడ్డ పాలెంలో వేద పాఠశాలను నడుపుతున్నారు. దానిలో వేదం వ్రాత ప్రతుల భాండాగారం వున్నది. పలువురు పండితులు వేదంలో పరిశోధనలు జరుపుతున్నారు. ఈ పరిచయ పుస్తకం దేశంలో రెండువేల మంది చతుర్వేద పారంగతులున్నారనీ వీరిలో 90 ఏళ్ళ ముసలివాళ్ళు మొదలు ఆరు సంవత్సరాల వారి వరకు వున్నారని తెలుస్తున్నది.

### ఫఖ్రుద్దీన్ పేర ధర్మ సంస్థలు

మాజీమంత్రి శ్రీ కె. ప్రభాకరరెడ్డి ఇంట్లో ఫిబ్రవరి 15న జరిగిన సమావేశంలో శ్రీ రెడ్డి ప్రధాన పోషకులుగా ఆంధ్రప్రదేశ్ ఫక్రుద్దీన్ అలీఅహమద్ స్మారక సంఘం ఏర్పాటయింది. ఈ సంఘం వైద్యశాలలు, విద్యాసంస్థలు, అనాథశరణాలయాలు నెలకొల్పడానికి జాతీయ సమైక్యం దృఢతరంచేయడానికి ముషాయిరాలు ఇతర సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించడానికి నిశ్చయించింది. ఈ సంఘం అధ్యక్షులు— శ్రీ మహమ్మద్ అబ్దుల్ రహీం ఆజాద్. ఉపాధ్యక్షులు శ్రీయుతులు శ్రీనివాసరావు— డాక్టర్ ఎం. వి. ఖలీలుల్లా, షాహుజ ఫరూఖీ. ప్రధాన కార్యదర్శి: శ్రీ మాలిక్‌మహమ్మద్ అలీఖాన్.

### ఉప శ్రు తి :

'ఏమి సార్! తమరూ మారి పోయారే?' అన్నాను పార్టీ ఫిరాయించిన ఒక నాయకునితో. ఆయన సమాధానం చెప్పేలోగానే వెంటవున్న ఉపనాయకుడు "మార్పు జీవలక్షణమండీ! జడంగా ఏ ప్రాణీ కూర్చోలేదు." అని సమాధానం చెప్పాడు. "మీ నాయకునిలో ఆ మాత్రం జీవం వుందా" అని అడగాలనుకున్నానుగాని ధమ్ములేదీ ?

— తిరుమల రామచంద్ర



రామచంద్రుడు గ్రామంలోకి ప్రవేశించి వీధుల వెంబడి నడవసాగాడు.

— వీధిలోని ఒక పూరింటి కప్పు సగం ఎగిరిపోయింది కప్పు ఎగిరిపోయిన చోట వెదుళ్ళు కనిపిస్తున్నాయి. మిగిలివున్న కప్పు మీద గడ్డి మొలిచివున్నది రామచంద్రుడు చూస్తుండగానే రెండు గబ్బిలాలు కీచు కీచుమంటూ వెదురు సందుల గుండా ఎగిరి వచ్చాయి. ఇంటి లోపల కొన్ని పిల్లులు భీకరంగా కొట్లాడుకుంటూ ఉండటం వినిపిస్తూ ఉంది. వీధిలో పరుగిడుతున్న కుక్క ఒకటి పిల్లుల కొట్లాటను విని ఆగి ఇంటివైపు తిరిగి భౌ భౌ మని మొరగసాగింది.

మరొక యింటికప్పు పూర్తిగా లేచిపోయింది దూలాలు గోడలు మాత్రం మిగిలి ఉన్నాయి. నసిపట్టిన దూలాల మీద కాకి గూళ్ళు లేచి ఉన్నాయి. ఇంటినిండా దూలగొండి పొదలు మొలిచి ఉన్నాయి. రెండు తొండలు ఒకదాని నొకటి తరుముతూ, ఒకదాని మీదొకటి ఎక్కుతూ నీచి కష్టంగా పరుగెత్తి దూలగొండ పొదలలో మాయమైపోయాయి.

ఒక్కొక్క యిల్లు ఒక్కొక్క సమాధి వలెను, ఊరు ఒక స్మశానం వలెను ఉన్నది. సమాధుల నుండి లేచివచ్చిన శవాలవలె గ్రామస్థులు వీధుల వెంబడి నడుస్తున్నారు.

రామచంద్రుడు మునసబుగారి మూడంతస్థుల భవనాన్ని సమీపించాడు. అది సుగిరాల మైన ధనంతి రాజప్రాసాదంలాగ ఉన్నది. అది ఎంత వైశాల్యంలో సగానికి ఆక్రమించుకుని ఉన్నది. గంభీరమైన దాని సింహద్వారానికి ప్రక్కన ఒక ట్రాక్టరు నిలుచుని ఉన్నది. దాని డ్రైవరు ఇంజనులో తల దూర్చి మరలను త్రిప్పుతున్నాడు. వాని బట్టలు పెట్రోలు మరకలతో నిండి ఉన్నవి.

రామచంద్రుడు ట్రాక్టరును సమీపించాడు కొంతసేపటికి డ్రైవరు ఇంజన్‌లో నుండి తలెత్తి దేనికోసమో వెదుకుతూ రామచంద్రుని చూసి 'ఏంకావాలి' అన్నట్లు కళ్ళెగరేశాడు.

"మాది తూరుపు దేశం. రోడ్డుకాడ సత్తరంలో దిగినా. మునసబుగారు ఏదైనా కూలిపనిస్తే, సేద్దారనొచ్చినా." అన్నాడు రామచంద్రుడు.

"ఆ కతలు నాకేమి తెలవవు. అదో






(గత సంచిక తరువాయి)

మునసబుగారొస్తా వుంటారు. ఆయన్నే అడుక్కో." అన్నాడు డ్రైవరు.

మునసబుగారు సింహద్వారాన్ని దాటుకుని వచ్చి నిలుచున్నాడు. ఒక చేతో పంచె అంచును ఎత్తి పట్టుకుని, మరొక చేత్తో తన పెంపుడుకుక్క మెడకు ఉన్న గొలుసును పట్టుకుని నిలుచున్నాడు.

"అదే నడక. అదే పోరు ఈశ్వరిని —" అనుకున్నాడు రామచంద్రుడు.

ఇంతలో మునసబుగారి 'తొత్తు' లోపల నుండి వచ్చి మునసబుగారి చేతిలోని గొలుసును వినయంగా తీసుకున్నాడు. కుక్క తనను బలవంతంగా లాగుతుండగా ఆ తొత్తు వెంబడి సాగిపోయాడు.

రామచంద్రుడు మునసబుగారి కెదురుగ వచ్చి, భుజం మీదున్న తవ్వాయుధ్ని చేతులలోకి తీసుకుని, "దండాలు సామి." అన్నాడు.

కనురెప్పల తాటింపుతో మునసబుగారు ఏదో ప్రశ్న వేశాడు.

**జరిగినకథ ·7** రామచంద్రుడు చేసిన చాకిరీకి ఫలితంగా ఇల్లుకట్టుకోవటానికి పోరంబోకు నేల ఇప్పిస్తాడు పెదరెడ్డి. రామచంద్రుడి భార్య నాగ. పెదరెడ్డి కోరినట్లు కోర్టు కెళ్ళి దొంగ సాక్ష్యం చెప్పడు రామచంద్రుడు. పెదరెడ్డి రిపోర్టు వేయటంతో పోరంబోకు ఖాళీచేయమని రామచంద్రుడికి ఉత్తర్వు జారీ చేస్తాడు కలెక్టరు. పెదరెడ్డిని వేడుకోటానికి వచ్చిన రామచంద్రుడిని లోటి హరిజనులే హింసిస్తాడు. రామచంద్రుడి ఇల్లు పడగొట్టిస్తారు ప్రభుత్వాధికారులు. ఊరు వదిలిపెట్టి బయల్దేరతాడు రామచంద్రుడు కుటుంబంతో.

"మాది తూరుపుదేశం సామి రోడ్డుకాడ సత్తరంలో వరుండా. ఒక రెండు దినాలపాటు కూలిపనేదైనా ఇస్తే సేద్దారనొచ్చినా."

"ఏంపని చేస్తావు?" అనడిగాడు మునసబు. ఆ కంఠంలో నిర్లక్ష్యత, మదాంధత, అధికార దర్పమూ — వీటన్నిటితోపాటు ఎందుకు నిర్దయత్వంగూడ ధ్వనించింది.

"సేద్దిం నాద్దిం కొట్టినోడిని దొర."

"గొడ్డలి పని ఏమాత్రం తెల్సు?"

"బాగాతెల్సును సామి. గొడ్డలెత్తుకున్నానంటే వొంచిన్నదు మెత్తకుండా నలుగురు మనుషుల లావుండే దూలాన్ని పేళ్ళుపేళ్ళు పారేస్తా."

మునసబుగారు వెనకకు తిరిగి. "రా. కుంటోడా!" అనిపిలిచాడు. అల్లంతదూరాన నిలుచుని ఇటువైపే చూస్తున్న కుంటివాడు కాలును ఎగరేసుకుంటూ వచ్చి యజమాని ముందు చేతులు కట్టుకుని నిలుచున్నాడు.

మునసబుగారు బరువుగానాలిపోతున్న కనురెప్పలను అతి ప్రయత్నం మీద పైకెత్తుతూ,'చందిరిగానికేమైనట్టు' అనడిగాడు,

"వానికి కీళ్ళు పోట్లంట సామి,ఒళ్ళంతా మన్నం ఎడగబోసనట్టుండాదంట. ఏపనిచేసేదగ్గర నిత్తాటంలేదు" అన్నాడు కుంటోడు.

"సరె. వానికత వొదిలెయ్ వాని పని ఈ కొత్త మనిషికి చెప్పు తీసుకుపోయి తోట చూపించు." అని మునసబుగారు రామచంద్రుని వైపుతిరిగి, "తూరుపోడా వాసు ఏనకాలపో. పనిచూపిస్తాడు." అన్నాడు.

## 12

రామచంద్రుడూ, కుంటివాడు- ఒకరి వెనక ఒకరుగా నడుస్తున్నారు వాళ్ళు వెంలాటి చుట్టలను భుజాలకు తగిలించుకుని గొడ్డళ్ళను భుజాల మీద ఉంచుకుని చేతుల్లో కత్తులు పట్టుకుని నడుస్తున్నారు ముందు నడుస్తున్న కుంటోడు, "ఏయూం వాళ్ళో?" అనడిగాడు.

"మాలోళ్ళమన్నా." అన్నాడు రామచంద్రుడు.

"సాకనాటోళ్ళా. బద్దండోళ్ళా?"

"రెండూగాదు. రంపాలోళ్ళం" అన్నాడు రామచంద్రుడు.

"ఔ. ఔ. తూరుపుదేశాన రంపాలోళ్ళు ఇనోసం. మావోళ్ళు పిల్ల పెత్తాసం పినా



## ఇన్‌క్రెడిబుల్ గాడెస్

లంటే తూరుపుదిక్కు తప్పించి కడవదిక్కులన్నీ పోతాం." మేము పోకనాటోళ్లం."

"పోకనాటోళ్లు ఉండూరు ఇడిసి పెట్టరు. కాపుల పంచన బాగ చేరతారు. కాపోళ్లు కొట్టినా తిట్టినా మీరు పడుండినట్టు మేము పడుండలేం." అన్నాడు రామచంద్రుడు.

"మీ తెంపూ తెగవా మాకు రాదు. ఇస్కూలు సదువులు మీకు అబ్బినట్టు మాకు అబ్బవు ఊర్లు దిరిగేదానికైనా గవుర్మెంటు ఉద్యోగాలకైనా మీకు రద్దే. ఎవుని చేతిని చిక్కిన కొమ్మ వానిది."

వాళ్లిద్దరు మునసబుగారి కొబ్బరితోటలోకి ప్రవేశించారు. అది మూడెకరాల వైశాల్యంగల తోట. కొబ్బరిచెట్లు వరుసలు వరుసలుగా నిలుచుని ఉన్నాయి. కొన్ని చెట్లు కాపుకాసి వంబాలుచేసి ఉన్నవి. మరికొన్ని పూత మాత్రం పూసి ఎర్రగ గింజుకొని ఉన్నవి. మరికొన్ని ఏమీ లేకుండా పచ్చని మట్టలను వ్రేలాడేసుకుని ఉన్నాయి.

ఆ చెట్లనన్నింటినీ ఒకసారి చూసి రామచంద్రుడు "పిలకలను రెండు మూడు అదునుల్లో నాటినట్లుంది" అన్నాడు.

"చూస్తే అట్టనే అనిపిస్తుంది. కాని నాటేదేనో అన్నిటినీ ఒకే అదునులోనే నాటినారు."

"ఐతే చెట్లన్నీ ఒక్కొక్కటి ఒక్కొక్క దోవగా ఉందామే. ఎందుకట్ల?" అనడిగాడు రామచంద్రుడు.

"నాటేటప్పుడు పిలకలు పక్కపక్కగా ఒకదానికొకటి తగిలేటట్టుగా నాటేసినారు. ముందుగా పైకి వచ్చిన చెట్టు నేలలో ఉండే సత్తువ నీళ్లు అంతా పీల్చేసి పెవళమయి పోయింది. ప్రక్కనుండే చెట్టుకు కావలసిన సత్తువ నీళ్లు లేక అట్టనే యినకబడి పోయింది. చెట్లన్నీ సరిగ్గా పెవళం కావాలంటే వాటి నడ్డిన కావలసినంత యెడం ఉండాల. ఈ చెట్టు మీదుండే ఉడత ఆ చెట్టు మీదకు దాటుకోలేనంత యెడం ఉండాలి. మొన్న గవుర్మెంటు ఆపీసరొకాయన వచ్చి తోటంతా చూసి ఆ మాటే చెప్పినాడు."

"ఇప్పుడు మనం కొట్టెయ్యాల్సిన చెట్లు ఏవి?"

"ఇవి అని రాసిపెట్టలేదు" అంటూ కుంటివాడు దాపురనున్న కొబ్బరిచెట్టు పైన చేయివేసి "దీనితో మొదలు పెట్టుదాం. చెట్టు మార్చి చెట్టు కొట్టుకుంటూ పోదాం. పొద్దుపోయేదాక కొట్టుదాం మిగిలినవి రేపు" అన్నాడు.

"కూలిమాట చెప్పలేదే." అన్నాడు రామచంద్రుడు.

"దినకూలి ఇచ్చేది లేదు. మునసబుగారు చెప్పుతున్నారు. చెట్టుకు మూడురూపాయల లెక్కన ఎన్ని చెట్లుకొట్టితే అన్నిమూడు రూపాయలు" అన్నాడు కుంటోడు.

వాళ్లిద్దరు పంచెలను గోచిపోసి బిగించి తలపాగాలను సవరించుకుని, కార్యోన్ముఖులయ్యారు రామచంద్రుడు కత్తితో కొబ్బరి చెట్టు మొదటనున్న ముళ్లపొదను నిర్మూలించాడు చేంతాటి చుట్టను భుజానికి తగిలించుకుని కొబ్బరి చెట్టును అధిరోహించడం ప్రారంభించాడు.

అతడు చెట్టును సగానికి ఎక్కగానే మూడవ చెట్టునుండి కుంటోడు అరిచాడు: "ఒరూ రామయ్యా. మరీపైకి ఎక్కవద్దు అడ బిలేట్లు గుచ్చిపెట్టినారు." అని.

రామచంద్రుడు టక్కున ఆగిపోయి, "ఏమిటివీ? బిలేట్లా?" అన్నాడు.

"అవి ఓరేచ్చే చదుకున్నోల్లు గెడ్డం గీసుకునే బిలేట్లు రెయ్యిపూట దొంగలొస్తారని సుడి దగ్గర గుచ్చిపెట్టినాం. నువ్వు సుడి దాక పోబాక."

రామచంద్రుడు భుజానికీఉన్న చేంతాటిని తీసి ఒకకొనను చెట్టుకు ముడివేసి రెండవ కొనను క్రిందకు వదిలాడు, అదినేల మీద బీరాడసాగింది.

ఇద్దరూ క్రిందకు దిగివచ్చారు గుండెల నిండా గాలి పీల్చుకుని చెరియొక చెట్టును నరకడం ప్రారంభించారు.

రామచంద్రుడు దెబ్బవేయటంతో కొబ్బరి చెట్టు సుడినుండి మొదలుదాక ఒకసారి అదిరింది. సన్నని పేళ్ళు చెట్టునుండి బయలుదేరి రివ్వున దూసుకుపోతున్నాయి. వంబాల వద్ద కిచకిచలాడుతుండిన ఉడతలు బిత్తరపోయి మట్టలమీద డబడబమని పరుగెత్తి ప్రక్కనున్న చెట్లలోనికి దాటుకున్నాయి.

సూరీడు నిప్పులు చెరుగుతూ వస్తున్నాడు. సూర్యుని కిరణాలు కొబ్బరి మట్టల సందులద్వారా దూసుకుని వస్తున్నాయి.

రామచంద్రుడు నడుము ఎత్తి నిలుచుని గొడ్డలిని నేలపైన ఆంచి మరొక చేతితో నుదుటిమీద చెమటను తుడుచుకున్నాడు.

అతనిని చూసి కుంటివాడుగూడా పని ఆపి వెటకారంగా "సేద్దెం నాద్ది కొట్టినానంటివే. ఇదేనా నీ సత్తా" అన్నాడు.

"నిన్నంతా దోవ నడిసినాన్నా. నడుం నిలవడంలేదు"

"ఎన్నన్నా చెప్పు. ఎండకూ గాలికి మేము

## చేసిన పరీక్షల వలన తేలింది...







# రుచికీ,
# విటమిన్లకూ, పుష్టికీ
# బిస్కట్ అంటేనే ఇది

బ్రిటానియా

# గ్లూకోజ్-డి



బ్రిటానియా గ్లూకోజ్-డి బిస్కట్లతో పాటు మరో ప్రముఖ బ్రాండ్ గ్లూకోజ్ బిస్కట్లను పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వలన తేలిందేమిటంటే: విటమిన్లు మరియు మొత్తం మీద పుష్టినిచ్చే పదార్థాలు గ్లూకోజ్-డిలో ఎక్కువగా ఉన్నాయని. అంతేగాక రుచికోసం, తియ్యదనం కోసం, కరకరలాడే తనానికి దీనిని కావాలంటారని. శక్తినిచ్చే విషయంలో, గ్లూకోజ్ కన్న గ్లూకోజ్ డి 20% ఎక్కువ శక్తినిస్తుంది! బ్రిటానియా గ్లూకోజ్-డి-తియ్యటి రుచితో కూడిన శక్తి!




అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్‌కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.

బ్రిటానియా బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-BBC.GL-10-140 TL

## ధర్మపథం

### ఆదిత్య హృదయ ప్రశస్తి

రామ, రావణులకు ఘోరంగా యుద్ధం జరుగుతున్నది. ఒకరి కొకరు తీసిపోవడం లేదు. శ్రీరాముడు పరాక్రమించి, బాణాలను ప్రయోగించి రావణుని శిరస్సులను తెగగొట్టాడు. అయినా రావణుడు చావలేదు. మరి శిరస్సులు మొలుస్తూనే ఉన్నవి. ఎన్నిసార్లు ఖండించినా అవి పుడుతూనే ఉన్నవి. అప్పుడు అగస్త్యమహాముని ఉపదేశించిన ఆదిత్య హృదయాన్ని శ్రీరాముడు జపించి అస్త్ర ప్రయోగం చేసిన తర్వాతనే రావణుని సంహరించగలిగాడు. రావణుడు మరణించాక మరి శిరస్సులు ఎలా మొలుస్తాయి. అతడు చస్తేనే గాని తలలు మొలవడం మానలేదు.

ఇది రామాయణంలో రావణ సంహారానికి సంబంధించిన కథాంశం. ఈ కథాంశాన్ని ప్రస్తావిస్తూ అవధూతలై అరుణాచలంలో ఉంటూవుండిన శేషాద్రిస్వామివారు ఇందువల్ల గ్రహించదగిన గూఢార్థాన్ని ఒకసారి యాదృచ్ఛికంగా తెలియజేశారు.

కామ క్రోధాలు రాక్షసుల వంటివి. రాక్షసులు రాత్రించరులు. అంధకారంలోనే తిరుగుతూ ఉంటారు. అజ్ఞానమనే అంధకారం ఉన్నప్పుడు కామ, క్రోధాలు విజృంభిస్తాయి. అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు విషయములందు ఆసక్తములయి ఉంటాయి వాటిని లోబరుచుకొనడానికి ఎంత ప్రయత్నించినా కామ క్రోధాలు మానవునితో ఉన్నంతకాలం అవి స్వాధీనం కానేకావు. ఒకప్పుడు స్వాధీనమయినట్లుండి, వెంటనే మామూలు పద్ధతిలో పడిపోతాయి. జ్ఞానజ్యోతి తన కాంతులను ప్రసరింపజేసినప్పుడే అజ్ఞానాంధకారం తొలగిపోయి కామ క్రోధాలు నశిస్తాయి. అవి నశిస్తే రాక్షసుడు నశించినట్లే. ఇంద్రియ దశకం అప్పుడు విషయాలకోసం విజృంభించక అణగారిపోతుంది.

రావణుడు కామ, క్రోధాలు మూర్తీభవించిన నిండు విగ్రహం. నిశాచరుల నియంత. అతని పది తలలూ జ్ఞానేంద్రియాలు అయిదింటికీ కర్మేంద్రియాలు అయిదింటికీ ప్రతీకలు. శ్రీరాముడు ఆ దశ శిరస్సులనూ ఛేదించినా, రావణుడు జీవించే ఉన్నాడంటే ఇంద్రియాలు తాత్కాలికంగా అరికట్టబడినా కామ క్రోధాలు నశించనంతకాలం స్వాధీనంలో ఉండవని అభిప్రాయం. కామ క్రోధాలు (రావణుడు) నశించిన తర్వాతనే ఆ ఇంద్రియ శిరస్సులు అణగిపోయాయి. రావణ సంహారం కోసం శ్రీరాముడు ఆదిత్య హృదయం జపించడం జ్ఞానజ్యోతిని పొందడమన్నమాట! జ్యోతి ఉంటే అంధకారం పటాపంచలుకాక ఏమవుతుంది?

ఆదిత్య హృదయానికి అసాధ్యమయిన రోగాలను నివర్తింపజేసే గొప్ప శక్తి కూడా ఉన్నది. అది వేరే విషయం.

— బులుసు వేంకట రమణయ్య

---

## ఇన్ క్రెడిబుల్ గాడెస్

వోర్పుకున్నాగా మీ రంపాలోళ్ళు వోగ్గలేరు. కొంచెం అట్ట కూర్చుని గస తీర్చుకో." అన్నాడు కుంటోడు.

రామచంద్రుడు మట్టిమీద కూర్చుని [illegible] తీసి భుజాన వేసుకుని, "నువ్వీడ మునసబుగారింట్లో ఎన్నేండ్లు గాఉండావు?" అనడిగాడు.

"నాకు బుద్ధి తెల్సినప్పట్నుంచి."

"వరుమానం బాగ ఉండేమో."

"వరుమానం యాడిది. దంచినమ్మకు బొక్కిందే దక్కుడని సామెత్సెప్తారే అట్ల కూలీ గుడ్డా గడిచి పోతుంది"

"మరి దమ్మిడీ దుగ్గాలో ముట్టదా?"

"అదీ ఉంది. పోతే చేతికి రాదు. నా పెండ్లికి ముందు మునసబు దగ్గర మూడునూర్లు అప్పుదీసుకుంటిని నువ్వు చెప్పిన దమ్మిడీ దుగ్గాణీ అంతా అప్పులో జమ అయిపోతుంది."

"ఇప్పుడు నీ వయసెంత?"

"నలభై కి పైబడింది. మధ్యాహ్నమై పోయిందనుకో."

"ఇన్నేండ్లు పన్జేసినా ఆ మూడునూర్లు అప్పు తీరనేలేదా?"

"సంవత్సరానికి వడ్డీ తీరతా ఉంది. అసలు లోపలికి ఇంకా పోలా."

"ఈ లెక్కన అసలు తీరేదెప్పుడు?"

కుంటోడు గూడ తలపాగను తీసి నేలమీద వేసి దానిమీద కూర్చుంటూ "ఇక అది తీరేది నేను కాష్ఠం మీదకు పోయేనాటికే" అన్నాడు. వాడు బొగ్గిట్లో నుండి రెండు బీడీలను తీసి ఒకటి నోట్లో పెట్టుకొని, ఇంకొకటి రామచంద్రునికి అందించబోయాడు.

రామచంద్రుడు నిరాకరిస్తూ "వొద్దు వొద్దు ఇప్పుడు బీడీ ముట్టిస్తే పని తెమలదు" అన్నాడు

"పరవాలేదులే ఇంతతో నువ్వు [illegible] పాలించేసేదేమీలేదు" అంటూ కుంటివాడు బలవంతంగా బీడీని రామచంద్రుని చేతిలో పెట్టి "చెకిముకి తెస్తా నుండు" అంటూ లేచాడు.

వాడు అత్తిమాను తొర్రలో వానకు మంచుకు తడవకుండా దాచుకుని ఉన్న బూరగ దూదినీ, ఇనుపముక్కలను తెచ్చి నిప్పురగిలించి ఇద్దరి బీడీలను వెలిగించాడు.

రామచంద్రుడు బీడీపొగను లాగివదులుతూ "నీపావిడి చూస్తా ఉంటే నీకు ఆ మూడు నూర్లు అప్పు తీర్చేఆలాసిన ఉన్నట్టే లేదు." అన్నాడు.

కుంటివాడు నోటిదగ్గకు తీసుకుపోయిన బీడీని దించి, "అదీ నేన్చెప్పలా రంపాలోళ్ళకు ఇంగితం జాస్తి. నువ్వు సరిగ్గా వూహ జేసినావు. అప్పు తీర్చే ఆలాసిన నా కడుపులో లేదు. తీర్చేసి నేను మాత్రం యాడికి పోవాల? బొంబాయికి పోవాల్నా. కలకత్తాకు పోవాల్నా. సిమ్మాసనాలెక్కల్నా. రాజ్యాలేలాల్నా?" అంటు గల గల నవ్వాడు.

"నువ్వు అట్టా అను కుంటావు సరే. రేపు నీకొడుకు ఏంగావాల?"

"ఏం? వానికేమవుతుంది?" అడిగాడు కుంటోడు.

"నువ్వు ఎట్టా అప్పు తీర్చకుండానే చస్తావు. నువ్వు పోయినాక ఆ మునసబుగారు నీ కొడుకుని పట్టుకుంటాడు ఇంట్లో సేద్దిగాడుగా వుండమంటాడు."

కుంటివాడు తేలికగా నోరు చప్పరించి, చేయి విదిలించి, "వాని నొస్టిన అట్టరాసి వుంటే అట్టనే జరుగుతుంది. పలానా కుంటోని కొడుకు పలాన మునసబుగారి పంచన చేరాలని రాసివుంటే అట్టనే జరుగుతుంది. నువ్వు ఈడ గూసోని తల పగలగొట్టుకుంటే తప్పుతుందా?" అన్నాడు

"నీ యింటి విషయాలకుగాను తలపగల గొట్టుకునే కర్మ నాకేమొచ్చింది. నేనేదో

మాటవరసకు అడిగినా." అని రామచంద్రుడు పైకిలేచి బీడీని పారవేసి, "ఇక రెయ్యి. పొద్దెక్కిపోతావుంది." అంటూ గొడ్డలిని చేతిలోనికి తీసుకున్నాడు.

## 13

రామచంద్రుని కొబ్బరిచెట్టు దాదాపు పూర్తిగా తెగింది. అతడు నేల జీరాడుతున్న చెంతాటికొనను పట్టుకుని దూరంగా తీసుకునిపోయి ఒక కాలిని ముందుకూ ఒక కాలిని వెనకకు పెట్టి దారాన్ని బలంగా గుంజసాగాడు. అలా నాలుగు సార్లు గుంజేసరికి కొబ్బరి చెట్టు పెళపెళమని విరిగి ధనేలమని నేల కూలింది. అది పడినంత మేర నేలమీద పచ్చగడ్డి, వెంపలిచెట్లు నలిగిపోయాయి. కొబ్బరి మట్టలు కొన్ని చీలిపోయాయి. వివిధ పరిమాణాలలో ఉన్న కొబ్బరి కాయలు గెలల నుండి విడివిడి చెల్లాచెదరుగా పరుగెత్తాయి.

ఈలోగా కుంటివాడు: వాడా తన కొబ్బరి చెట్టును కూలదోశాడు వాడు కంచె వద్దకు నడచి ఎలుగెత్తి, ఒకామెను పేరు పెట్టి పిలిచాడు తరువాత తోటమధ్య కాపలాకై వేసిఉన్న గుడిసెలోనుండి తట్టను తెచ్చి చెల్లాచెదరుగా పడివున్న కొబ్బరికాయలను ఏరి తట్టలో వేశాడు. అతడు తట్టలోని కాయలను కుదించి నడుమెత్తేసరికి అతడు పిలిచిన స్త్రీ తోటలోకి వచ్చింది. అతడు తట్టను ఆమె నెత్తిన పెట్టి, "ఏసుకపోయి నేరుగా మునసబుగారింట్లో దించిరా. దోవలో యాడన్నా ఒక కాయ శాదం చేసినావంటే నీ కొప్పు కోసేస్తా," అన్నాడు.

రామచంద్రుడు పడిపోయిఉన్న కొబ్బరిచెట్ల మొదలువద్ద దేన్నో వెదక సాగాడు. కుంటోడు ఉత్సాహ పడుతూ, "ఏందాన ఏముంది అని ఉందాప?" అనడిగాడు.

"ఈడెడనో బిరెట్లు గుచ్చి పెట్టినానంటివే, కడబడలేదే."

"అవి అంత సులభంగా కనబడవు. నేను చూపిస్తానుండు." అంటూ వచ్చి కుంటోడు తాను అతి చాకచక్యంగా గుచ్చి ఉంచిన మేకులను బయటకు లాగి చూపించాడు. ఒక్కొక్క చెట్టున రెండేసి మేకులున్నాయి. రెండు చెట్లనుండి ఊడదీయబడిన నాలుగు మేకులు ఎండలో తళ తళ మెరుస్తున్నవి.

రామచంద్రుడు కుంటోని ముఖంమీద చూపులు నిలిపి, "ఏమి కసాయి మనిసివన్నా నువ్వు. కాసంత టెంకాయ బుగత దొంగతనం పోతాదని ఇంత గోరం చేస్తావా? వాడెప్పుడన్నా ఏడంపక్కన నిద్దర లేచిఉంటే లొడలు తెగి కింద బడి చస్తే ఆ పాపం ఈడేరే దెవ్వుడు?" అన్నాడు.

కుంటోడు కొబ్బరిచెట్టుకు ఉన్న దారాన్ని విప్పుతూ, "వన్నేం జెయ్యమంటావు తూరుపాయనా. తోటనాదా? కాయనాదా? మునసబుగారు చెప్తే గుచ్చిపెట్టినాను" అన్నాడు.

"మునసబు చెప్పే అమేధ్యం గూడా తింటారు మీ పోకనాటోళ్లు" అని రామచంద్రుడు కుంటోని ముఖం మీద నుండి దృష్టి మరల్చుకుని "మీరూ మీ బుద్ధులు యాడన్నా అగ్గిబడి పోమరుగాని, ఈ సంగతి పోలీసోళ్లకు తెలిస్తే నిన్నూ, నీ మునసబునూ జెయిల్లో పెట్టిస్తారు. అద్దెల్సుకోముందు" అన్నాడు.

కుంటోడు దారాన్ని చుట్ట చుట్టుతూ "నువ్వు మరీ రంపాలోడు మాదిరి మాటాడతా ఉండావు తూరుపాయనా. మ్తా మునసబుగారు నిన్న నడివీధిలో నిలబెట్టి లరవంగ అరవంగా గొంతుగోసి చంపేశాడుకో. కోట్టు కొచ్చి బోనలో నిల్చుకుని ఇది పాపము. ఇది పుణ్యము అని సెప్పిచెప్పె బండిరాయ ఈ పాలసిన్లో గాని, అగ్గురారంలో గాని ఏమి కుంది?" అంటూ సవాలుచేసి ప్రశ్నలు కొంతసేపు ఎదురుచూసి, "ఒకసారి ఇట్టనే కాపోళ్ల పిల్లగోడొకడు టెంకాయచెట్టంటే దానికి ఎక్కినాడు. నేను రెయ్యికి రెయ్యే వచ్చి టెంకాయ చెట్లో బిరెట్లు గుచ్చిపెట్టి ఉండే సంగతి ఆ పిలగోనికి తెల్దు. సుడిదగ్గరకు పోయేసరికి బిరెట్లు కోసుకుని తొడలు తెగి తల్లక్రిందులుగా వచ్చి కిందబడినాడు" అంటూ వాడు చుట్టగా చుట్టిన దారాన్ని నేలమీదవేసి తాను కొబ్బరిచెట్టు మీద కూర్చుని "అప్పుడు నేను కల్లో పుట్ట గోగులు తవ్వుకుంటూ ఉండా. గబామనే శబ్దం ఇనపడగానే తొవ్విన పుట్టగోగుల్ని ఆడ యిడసి పెట్టేసి, తొలికిని ఒడపారేసి పరుగు వచ్చినా. వచ్చి సూస్తే ఏంవుండాది! టెంకాయ చెట్టు సుడిదగ్గర నుండి మొదలు దాక ఎర్రంగా నెత్తురు చారలు చారలుగా కారి వుండాది. చెట్టు మొదట వుండే గురువిందపొద నెత్తురుతో తడిసి పోయింది. పొద పక్కన పీనుగు పడుండాది. తల్లకిందులుగా పడటంతో తల, మెడ రెండూ రొమ్ములోకి కూరుకుని పోయుండాయి." అని అతడు అల్లంత దూరాన కొబ్బరి చెట్టు కింద వున్న గురివింద పొదను చూస్తూ తల ఊచి, "ఇట్టాంటిది మన మాలోల్ల పిలగానికె పురికన్నా జరిగి ఉంటే మనం కయికుక్క యిక్కవ కుండా పడి వుందుం. మనం ఉండినట్టు కాపోల్లు ఉందురా. వాళ్ళు ఉప్పూకూడు తిని వోళ్ళయిరే.

"పిలగోని సావుతో అగ్గురారం రొండు పార్టీలయి పోయింది. అవతల పార్టీ వోల్లు పోలీసోల్లకు రిపోరట్టు ఇచ్చి మునసబ్బుగారిని కోరుటుకు ఈడ్చినారు. కింద కోరుటు నుంచి పైకోరుటుకు మల్లా పైకోరుటు నుంచి కింద కోరుటుకు-ఇట్ట ఆరునెలలు జరిగింది."

'కడాన ఏవయింది?' అనడిగాడు రామచంద్రుడు

"ఏమవుతుంది? దుప్పటి మీదికి కంబళి బోసి ఎక్కితే ఇది అంచుకున్నట్టు మా మునసబుగారు ఈ యవారాన్నంతా దులిపేసుకున్నాడు. దులిపేసి ఆడికే ఊరికే ఉండినాడనా. కోరుటుకుపోయి నోళ్ళమీద, సాక్షి చెప్పి నోళ్ళమీద కంటుబెట్టుకుని, వాళ్ల ఉన్న వాళ్ల దాగెట్టుగ, వాళ్ల నరకం వాళ్ళు తినేట్టుగా చేసినాడు."

"ఎట్లనో?"

కుంటోడు తన కుడి తొడను ఎడమ తొడమీద వేసి, రెండు అరచేతులతో మోకాలిని చుట్టుకుని, "మా మునసబుగారు కోరుటు యవారాల్లో, పోలీసెవారాల్లో, రివిని యవారాల్లో పండితుడులే. సంవత్సరం తిరిగేసరికి అవతల పార్టీనోళ్ళు కొందరు ఇండ్లు పోగొట్టుకున్నారు. కొందరు ఆస్తిపాస్తులు పోగొట్టుకున్నారు. కొందరు కూనీ కేసుల్లో ఇరుక్కుని ఆడా ఈడా జెయిళ్ళ పాలైపోయినారు. కొందరు మునసబు పెట్టే బాదలు పడలేక ఊరిడిసి పెట్టి దేశాంతరం ఎల్లిపోయినారు." అన్నాడు. (ఇంకా వుంది)

## రాలిన ముత్యాలు

……శ్రీ సోమసుందర్……

చూశావా నీ మనస్సులో
ఎన్నెన్ని గరిక పచ్చ మైదానాలో?
సంగీతాల పరిమళించే
రంగు హోరంగుల పూదోటలో?

# డాక్టర్ సలహాలు!

డా॥ కె. వెంకటేశ్వరరావు

బి. ఆర్. తెనాలి

నా స్నేహితురాలి వయస్సు 20 సం.లు ఆమె కూర్చొని లేచినప్పుడు మోకాలు పట, పటమని శబ్దం వస్తుంది ఇలా ఎందుకు అవుతుంది తెలుప ప్రార్థన.

ఒక ఎముక ఇంకొక ఎముకకి ఒరుసుకునే సమయంలో ఆ రాపిడికి ఏర్పడే శబ్దాలే మీరు వ్రాసిన "పట—పట"లు. ఈ రెండు ఎముకల రాపిడి అనేది కీళ్ల వద్ద మాత్రమే సాధ్యం కాబట్టి, ఆ కీళ్లలోపల మామూలుగా ఉండే "సైనోవియల్ ఫ్లూయిడ్" అనే ద్రవం [రాపిడిని అరికట్టడానికి ప్రకృతిసిద్ధంగా అమరి ఉన్న నూనెవంటి పదార్థం] తక్కువ అయితే ఈ రాపిడికి ఎముకలు శబ్దించేస్తాయి మామూలుగా వయస్సు మీరిన వారిలో కాలంతో జరిగిన సహజ మార్పులవల్ల ఈ రాపిడి శబ్దాలు సహజం. కాని, రోజులు మారుతున్నాయిగా! కలి యుగంలో పోనుపోనూ వెంపలి చెట్టుకి నిచ్చెన వేయనవసరం కలిగే ఆకారులు పుడతారనే నానుడిని నిజం చేస్తూ ప్రస్తుత యువతరం పటుత్వం నేడు అంతంత మాత్రాన ఉందిగా.

మా ఇద్దరి పాపలకి పోలియో డ్రాప్సు రెండు కోర్సులు వేయించి, కొన్ని కారణాలవల్ల 6 నెలలై మూడవ కోర్సు వేయించలేదు. మూడవ కోర్సు ఇప్పుడు వేయించవచ్చునా? లేక మరల మూడు కోర్సులు వేయించాలా?

తప్పకుండా వేయించవచ్చును. [అంటే "బూస్టర్ డోసు"గా] ఈ సందర్భంలో ప్రస్తుత వైజ్ఞానిక ఆలోచనా దృక్పథం ప్రకారం రెండవ, మూడవ "డోసు"ల మధ్యకాలం దాదాపు 1 సం. వరకూ ఉంటే చాలా శ్రేష్ఠం. మీ పాపలకి తిరిగి ప్రారంభించనవసరంలేదు.

ఏలాగో ఈ విషయాన్ని గురించి రాస్తున్నప్పుడు మన దేశంలో అసలు ఈ పోలియో డ్రాప్సు వేయవలసిన అవసరం ఏ మాత్రం? అనేది వైద్యశాస్త్రవేత్తల వాదోపవాదాలకి గురికావటం, దీని ఆవశ్యకతను గురించి తీవ్రంగా ఆలోచనలు, దేశవ్యాప్తంగా పరిశోధనలు జరుగక పోవటం విచారకరమైనదనే విషయాన్ని ప్రస్తావించటం అనావశ్యకాంశం కాదుగా!

కె. యస్. ఆర్. వరంగల్

నాకు చిన్న వయస్సులో ఫిట్స్ వచ్చినవి. అందువల్ల మా పెద్దలు నానొసటిపై కాల్చినారు. అది చాలా అందవిహీనముగా ఉన్నది. అది తొలగిపోయే మార్గము ఉన్నదా?

ఒకసారి శరీరంలో చర్మం కాలిన తర్వాత ఏర్పడే "మచ్చ"ని పోగొట్టడం చాలా కష్టం అనే అని చెప్పవలసి ఉంది. ఏ "ప్లాస్టిక్" సర్జరీ చేసినా, ఎంత నిపుణులైన వైద్యులు చేసినా, ఆ మచ్చను, తొలగించిన ప్రదేశాన్ని, మామూలు చర్మంతో కప్పగలిగి ఉండి, అలా చేసినా ఆ చర్మం ఆ చోటుకి సరిపోవటం ఆ ప్రదేశంలోని మిగిలిన చర్మంతో కలిసిపోతుందో లేదో అనే విషయాలపై ఆ మచ్చ తొలగింపబడటం ఆధారపడి ఉంటుంది. 'ప్లాస్టిక్‌సర్జరీ'ల కన్నా మేలైనది "టాటూయింగ్" అంటే చర్మ రంగుకి సరిపోయే రంగుతో పచ్చబొట్టు పొడవటం అనేటటువంటి విధానం, మన దేశంలో వివిధ వర్ణాల చర్మాలు కల ప్రజానీకానికి, తగిన రసాయనిక రంగులు అన్ని చోట్ల లభ్యం లభ్యం అసాధ్యం అనే ప్రస్తుతానికి తెలియ చేయటం నాకూ బాధాకరంగానే ఉంది.

జి. ఎల్. పి. కోరాపుట్.

నా కుడికాలు పాదము కణుపు వద్ద 10—15 రోజులకొకమారు నొప్పి వస్తుంది. ఆస్ప్రోవంటి మాత్రలు వాడితే ఒకటి, రెండు రోజులకు తగ్గుతోంది. డాక్టర్లకు గూడా చూపించి మాత్రలు వాడాను. ఈ మందులన్నీ తాత్కాలికముగా ఉపశమనము ఇస్తున్నాయే గాని శాశ్వతముగా తగ్గట్లేదు

చాలా కాలంగా ఇలా నొప్పి వస్తూ ఉంటే ఎక్స్—రే (ఆ భాగానికి) తీయించి వైద్యులకు చూపించటం మంచిది. ఎముక సంబంధ రోగాల చికిత్సా విధానాలలో ప్రత్యేక శిక్షణ పొందిన వైద్యులు (ఆర్థోపెడిక్ నిపుణులు) మీ ఊరిలో ఉంటే వారికి చూపించి వారి సలహా పొందటం మంచిది. నొప్పి తాత్కాలికంగా ఉండటం, నొప్పిని హరించే మందులతో నయమవటం. వాపు మొ. వి లేకపోవటం— రోగం పెద్దగా హానికరమైనది కాదని, అమర్చవటం అనవసరం అని మాత్రం తెలుపగలను.

ఆర్. కె. సి. ఒరిస్సా.

నాలుకపై అంచులలో పూతలతో పుళ్లు వచ్చి 5 సం. లు అయినది. చాలా మందులు వాడినాను, తగ్గి, మరల వస్తున్నవి. మల పరీక్షలో ఇహెచ్. పుష్పరన్నారు. మీ సలహా కోరుతున్నాను.

ఎంటమీబా హిస్టోలిటికా (ఇ.హెచ్.)అనే పేరసైట్ మల పరీక్ష వల్ల జీర్ణాశయంలోఉందని తెలిసిన వెంటనే— దానికి తగిన "యాంటీ అమీబిక్" వైద్యం— వైద్యుల ప్రత్యక్ష పరిశీలనానంతరం వారి సలహాపై వాడి, వాటిని పూర్తిగా, పోగొట్టుకొని, తర్వాత "బికోస్నైన్" మాత్రలు దంపుడు బియ్యపు అన్నం— కామంచి ఆకురసం,నువ్వుబియ్యంజావ, కొబ్బరిపాలుమొదలయిన వాటిని వాడి, తిరిగి రాకుండా పాలిష్ చేసిన మల్లెపువ్వులాటి అన్నం కాక, మన సాంప్రదాయక దంపుడు బియ్యం అన్నం ప్రతినిత్యం తీసుకొంటే మీ నోటి పూత మీ వైపుకి మళ్ళీ రాదు. ●




# రాని బాకీలు

ప్రతాప రవిశంకర్

ముత్తురామన్ ఫైళ్లలో మునిగిపోయేడు.

అప్పటికి అతను ఆఫీసుకివచ్చి రెండు గంటలు కావస్తోంది. తోటిఉద్యోగులు కూడా వివరిఫైళ్లతోవాళ్లు కుస్తీపడుతున్నారు.

'మీకోసం ఎవరోవచ్చారు. అరుణాచలంట' ముత్తురామన్ దగ్గరగా వచ్చిచెప్పాడు ప్యూను జకరయ్య.

ఫైల్లోనించి చటుక్కున తలపైకెత్తి "అరుణాచలమా?" కొంచెం భయంగా అన్నాడు ముత్తురామన్.

అతని మాట విని మిగిలిన గుమాస్తా లందరూ తలలుపైకెత్తి అతనికేసిచూశారు.

ఫైళ్లనిమూసి ప్యూనుతో బయటకు నడిచాడు ముత్తురామన్.

ఓ ఐదునిముషాలపాటు నిశ్శబ్దం... అతను లోపలకురాలేదు.

కాని బయటనించి ఏవరివో మాటలు పెద్దగా వినిపించాయి. చెవులురిక్కించారు గుమాస్తాలు.

"సాటివాడివని ఓపికపట్టాను. ఇంకెన్నాళ్లని ఆగమంటావ్? బుద్ధిలేదూ? నాకు మాత్రం డబ్బుతో అవసరముండదను కున్నావా? నేనుఁ ఏ అధికారినా? ఈరోజు నాడబ్బు ఇవ్వకపోతే నీఅంతుచూస్తాను."

గుమాస్తాలు ఒకరిముఖాలొకరు చూసు కున్నారు. ఆతరువాత సైగలు చేసికొని బయటకు నడిచారు.

ఆఫీసు భవనానికి పదిగజాలదూరంలో వున్న వేపచెట్టు క్రింద నిలబడివున్నారు. ఇద్దరూ

ముత్తురామన్— మరో మనిషి అరుణా చలం ఐవుండవచ్చుననుకున్నారు. జకరయ్య అక్కడ లేడు.

"ప్లీజ్.. నాపరువు తీయకు. మరోపది రోజులు ఓపికపట్టు చలం" అతను మెల్లగానే అన్నా ముత్తురామన్ మాటలు పిల్లకు విని పించాయి.

"నేను నీ పరువు తీస్తున్నానా. అసలు నీకు పరువంటూవుందా? పరువున్నవాడివైతే ఇన్నాళ్ళు నీచుట్టూ తిప్పుకునేవాడివికాదు" అన్నాడు అరుణాచలం.

"మర్యాదగా మాట్లాడు" కోపంగా అన్నాడు ముత్తురామన్.

"ఏంచేస్తావ్?" ముత్తురామన్ మీదికి వచ్చేడు అరుణాచలం. వెంటనే ముత్తురామన్ అతనిషర్టు కాలరుపుచ్చుకున్నాడు.

ఆశ్చర్యపోయేరు గుమాస్తాలు. ముత్తు రామన్ అంత ధైర్యంచేస్తాడనుకోలేదు. పరిస్థితి చెయ్యిదాటిపోతోందని చెట్టుదగ్గరకు చేరి ఇద్దరినీవిడదీశారు.

"మీరు చెప్పండిసార్. సాటివాడని, కష్టాల్లో వచ్చిఅడిగాడని ఐదువందలు నోటు కూడా లేకుండా ఇచ్చాను అప్పుగా. ఇప్పటికి ఎనిమిది నెలలయింది. ఇంతవరకు పైసా కూడా చెల్లెయ్యలేదు. వడ్డీకూడా అక్కర్లేదే. నాలుగునెల్లనించీ తిప్పుకుంటున్నాడు. అదే మంటే కాలరు పుచ్చుకున్నాడు. ఇదిన్యాయ మేనా?" నిలదీసి అడిగాడు అరుణాచలం విడదీసిన గుమాస్తాలను.

ఎవ్వరూ పెదవి కదపలేదు.

ఆ ఆఫీసుస్టాఫ్‌లో ముత్తురామన్ ఒక్కడే బంధుడు కాదు. అతనికి భార్యతప్ప తన వాళ్లంటూ ఎవ్వరూ లేరు. ఇద్దరుపిల్లలు పుట్టిపోయేరు. అతనికి నాలుగువందలుజీతం. నెలకి న్యాయంగా వందో, మరోయాభయ్యో మిగులుతాయి. అప్పాహాలోనే తోటిఉద్యోగుల్లో కొంతమంది అప్పెల్లకితం తమ అవసరాలకు అతనివద్ద అప్పుచేశారు. ఐదువందల వరకూ లేదనకుండా అప్పులిచ్చేడు. కాని ఒక్కరూ అతనిబాకీ తీర్చలేదు ఇవాళ- రేపంటూ దాటేస్తున్నారు. గట్టిగాఅడగటానికి భయం. ముత్తురామన్ మొహమాటపడి మెతకవాడు.

"చెప్పండి సార్... అప్పటికీ నేను వడ్డీ వద్దు. అసలివ్వమన్నాను. అందుకూ్కడా ఒప్పు కోడంలేదు. సాటివాడని అభిమానం చూపడం బుద్ధితక్కువైంది." అన్నాడు అరుణాచలం.

నిముషం తర్వాత "ముత్తురామన్ అప్పు చేశాడంటే నమ్మలేకుండా వున్నాను. అతనికి అప్పుచేయాల్సిన అవసరం లేదు" అన్నాడు ఓ నడివయసు గుమాస్తా.

"లేకపోతే ఎవడుచేస్తాడు? ఆ రాత్రి పరి గెట్టుకుంటూ వచ్చాడు. తన భార్య చావు బతుకుల్లోవుందని, ఆపరేషన్ చెయ్యకపోతే పోతుందని చాలా ఇబ్బందుల్లో చెప్పాడు. అటువంటి స్థితిలో కాదని ఎలా అనాలని ఇచ్చాను"

'ఏమైనా పదిరోజుల్లోగా నేను ఇవ్వలేను' అన్నాడు మొండిగా ముత్తురామన్.

"ఎట్లా ఇవ్వవో నేను చూస్తాను. ఈరోజు మొదటితారీఖు. జీతం తీసుకు బయటకు రాగానే లక్కొనిపోతాను. సాయంత్రం వరకూ ఇక్కడే కూర్చుంటాను" అన్నాడు అరుణాచలం.

అతను ఆమాట అనగానే భయంగా— దీనంగా గుమాస్తాలకేసి చూశాడు ముత్తు రామన్.

గుమాస్తాలు అరుణాచలంకేసి చూశారు. నిజంగానే తన్నిలాక్కుపోయేట్టు కనిపించాడు. పరిస్థితి గ్రహించి వారిద్దరికి కొంచెందూరం వెళ్లి గుసగుసలాడుకున్నారు.

ఐదునిముషాల తర్వాత తిరిగివచ్చి "మీరితన్ని వదిలేయండి. సాయంత్రం ఐదు గంటలకురండి. మీబాకీ తీర్చేట్టు మేము చూస్తాము." అన్నాడు వాళ్లలో కొంచెం లావుగావున్న గుమాస్తా.. మిగిలినవారందరూ అవునన్నట్టు తలలువూపారు.

## రా ని బా కీ లు

"మీ మాట మీద నమ్మకంతో వదులుతున్నాను. సాయంత్రంబాకీ తీర్చకపోతే ముత్తురామన్ని మీరు మళ్లీచూడలేరు." అని భయపెట్టి విసురుగా వెళ్ళిపోయేడు అరుణాచలం.

ముత్తురామన్ని తీసికొని అందరూ లోపలకు నడిచారు. ఎవరిపనుల్లో వాళ్లు ఇరుక్కుపోయేరు.




లంచ్ టైంలో ముత్తురామన్ ఎవ్వరితోనూ మాట్లాడలేదు.

సాయంత్రమయింది. అందరూ జీతాలందుకున్నారు. ఎవరికివారే ముత్తురామన్‌దగ్గరికి వచ్చి వారిబాకీని వడ్డీతో సహా చెల్లించేరు. బాకీలన్నీవసూలయ్యేయి.

గడియారం ఐదు గంటలు కొట్టింది.

బయటకువచ్చాడు ముత్తురామన్. వేపచెట్టు కింద నక్షత్రకుడిలా నించునివున్నాడు అరుణాచలం. తోటిగుమాస్తాలందరూ చూస్తుండగా అరువందలు అతనికియిచ్చాడు తర్వాత గుమాస్తాలకు థ్యాంక్సుచెప్పుకొని రిక్షా ఎక్కి వెళిపోయేడు. అప్పటికే అరుణాచలం మాయమయ్యేడు.

ప్రతి మొదటి తారీఖు హోటల్ ఉదయ జనతా అందరూ కలసి టిఫిన్ తినడం గుమాస్తాల అలవాటు.

కబుర్లుచెప్పుకుంటూ అయిదూనే థైకి హోటల్‌దగ్గరకు వచ్చిన గుమాస్తాలకు ఒకరి భుజాలమీద మరొకరు చేతులు వేసికొని నవ్వుకుంటూ హోటల్లోనించి బయటకు వస్తున్న ముత్తురామన్ అరుణాచలం కనిపించేరు.

అంతా ఆశ్చర్యపోయేరు.

ముత్తురామన్ - అరుణాచలం ప్రాణ స్నేహితులని అరుణాచలం ఆ క్రితంరోజే విశాఖపట్నంనించి వచ్చాడనీ, రానిబాకీలను వసూలు చేసుకోవడంకోసం ముత్తురామనే మిత్రుడి చేత నాటకం ఆడించాడనీ వాళ్ళు వూహించలేకపోయేరు.



25

ఇద్దరూ లేచి ఇంటివైపు నడిచారు. ముందు గదిలో రామబ్రహ్మం మధ్య గదిలో సురేఖ కూర్చొనివున్నారు. రామబ్రహ్మం దగ్గరకు సూర్యం వెళ్లి కుశలప్రశ్న వేశాడు. సరోజిని సురేఖ దగ్గర నుండి రహస్యంగా వివరాలు సేకరిస్తోంది.

సురేఖ ఇలా చెప్పింది :

"వారు వచ్చారు. ముందు గదిలో కూర్చోండి అని చెప్పి తల వంచుకొనే కాళ్లు కడుక్కోవడానికి నీళ్లిచ్చాను. ఒకరి కొకరు బాగా ఎదురుపడలేదు కదా! ఆయనను నేనూ, నన్ను ఆయనా గుర్తించుకోలేదు."

సరోజినికి సూర్యం చేసిన ఊహ మనస్సులో వెంటనే మెదలింది. అతని అంచనా సరిపోయిందే! అనుకుంది.

"సరోజినిగారు మీకేమవుతార"ని ముందు గదిలోనుండే వారు అడిగారు. వరుసకు నేను అక్కనవుతాననీ, ఆమె దేవాలయానికి వెళ్లిందనీ ఇప్పుడే వస్తుందనీ, చెప్పాను — మధ్య గదిలోనుండే సమాధానం.

వంటింటిలో నుండి టిఫిన్ తీసుకువచ్చి పెట్టాను వారి నెక్కడో చూసినట్లు అనుమానం కలిగింది. వారు కూడా నావంక పరకాయించి చూడడం గమనించాను. కాఫీకూడా యిచ్చాను. అప్పుడు పేరడిగారు. చెప్పాను. "నువ్వేనా ?" అనేశారు. 'నన్ను నువ్వని ఎవరంటారు చెప్మా' అని పరిశీలనగా చూశాను. వారే! వారే! అప్పుడు మీది ఫలానా ఊరా ? అని అడిగి,వారేనని నిర్ధారణ చేసుకున్నాను.

"చేసుకున్న భర్తను ఎవరా అనుకునే గతి పట్టింది" అని బిగ్గఱగా అనేసి భోరున ఏడ్చాను కాళ్లమీద పడ్డాను. క్షమించమని అడిగాను. ఆయన యెంత మంచివారో! వెంటనే "క్షమించాను. లే!" అని నన్ను లేవతీశారు. వారివంక చూద్దునుకదా! కంటివెంట నీరు ధారగా కారుతోంది. సరోజనీ! వెంటనే నా పైటతో నేను వారి కన్నీరు తుడిచాను. వారి ఉత్తరీయంతో వారు నా కళ్లు అద్దారు.

ఎన్నేళ్లు వచ్చినా ఆడదానికి సిగ్గు అంటూ ఒకటి ఉంటుందికదా! నువ్వు వచ్చేవేళ అయిన వెంటనే వారిని ముందు గదిలో వదిలి నేను మధ్య గదిలోకి వచ్చేశాను."

సరోజిని చాలా సంతోషించింది.

"అంతా సక్రమంగా జరిగింది. అక్కా! నువ్వు నీ యింట్లోకి వెంటనే వెళ్లిపో" అని, "బావా!" అని సూర్యాన్ని లోపలకు రమ్మని పిలిచింది. సూర్యం రామబ్రహ్మన్ని వదిలివేసి గబగబా లోపలకు వెళ్లాడు.

"ఏం ? అయిపోయిందా ?" అన్నాడు నవ్వకుండా.

"ఏయ్ బావా! నీకంతా వేళాకోళంగా ఉంది."

"మనం వాళ్లను సంధానపరచడంకోసం ఏకాంతంగా వదిలివేశాంకదా, ఆ పని అయిపోయిందా అని అడిగాను. ఈ యింగ్లీషు చదువుకున్న ఆడవాళ్లకు అన్నీ దురర్థాలే తోస్తాయి."

సీరియల్

# మగది కథ

## పైడిపాటి సుబ్బరామశాస్త్రి

*(గత సంచిక తరువాయి)*

"వాళ్లకేమీ తోచవు. మగవాళ్లకు అల్లా అనడం సరదా. సంధానమయిపోయినదా ? అని అడగలేవూ ? అయిపోయింది" అని సురేఖ చెప్పిన వివరాలు చెప్పింది.

"ఓశ్ ! యింతేనా ? ఇది వట్టి పాడి పాడి సంధానం !"

సరోజిని నవ్వాపుకోలేక పళ్లతో పెదిమెలు నొక్కుకుంటోంది.

"వాళ్లను పునఃసంధానం చేయవలసిన అవసరం ఉంది. అప్పుడు నీ సంకల్పం నెఱవేరుతుంది. మన మార్గం సుగమం కావాలంటే, వాళ్లను మనింటికి భోజనానికి పిలవాలి."

"పిలు, బావా! ఇద్దరినీ నువ్వే పిలుస్తావా?"

"నువ్వు నీ అక్కను పిలు. నేను పెళ్లికొడుకును పిలుస్తాను."

"బావా! నీకు దణ్ణంపెడతాను. నన్ను నవ్వించకు. నేను బిగ్గరగా నవ్వానంటే, వాళ్లకేమో కారణం తెలియదు. అసహ్యంగా వుంటుంది."

"సరోజినీ! పల్లెటూళ్ళలో పెళ్లి అయితే కన్నెపిల్లలకు సరదాగా వుంటుంది. అయే పెళ్లేమో పెద్దవాళ్లకు. సరదాయేమో చిన్నవాళ్ళది. నిజానికి వీళ్ళు ఇద్దరూ, కొద్ది మినహాయింపులో క్రొత్త పెళ్లికొడుకూ పెళ్లికూతుళ్లక్రిందే లెక్క. ఈ కాలంలో పెళ్లిళ్ళన్నీ ఇంచుమించుగా ఈ వయస్సువేగా! అందుచేత వాళ్ళకు సరదాలుండవు. మనకు సరదా లుంటవి."

"బావా! నీ చమత్కారానికి నవ్వాలో ఏడవాలో తెలియడంలేదు."

"సరేకాని, రెండూ ఏకకాలంలో మాత్రం చేయకు" అని ముందు గదిలోకి వచ్చాడు.

"రామబ్రహ్మంగారూ! మీ దంపతులు యివాళ మా యింట్లో మా ఆతిథ్యం స్వీకరించాలి. తమరు, మేము భోజనానికి పిలచేదాకా, ప్రక్క వాటాలో ముందు గదిలో విశ్రాంతి తీసుకోండి" అని సూర్యం అంటూవుంటే సరోజిని గబగబా సురేఖ గదిలోకి వెళ్లి బొట్టు పెట్టి భోజనానికి పిలచివచ్చింది.

సురేఖ గదిలోనుండి సరోజిని బయటకు రావడం, వెంటనే రామబ్రహ్మం ఆ గదిలో ప్రవేశించడం చూసి, సూర్యం, మనస్సులో ఎంతో సంతోషించాడు. సరోజిని విందు భోజనం చక్కగా తయారుచేసింది. కులాసాగా సూర్యం కబుర్లు చెబుతూవుంటే రామబ్రహ్మం ఆనందంతో పొంగిపోయి, రెట్టింపు భోజనం చేశాడు. సురేఖకు సూర్యం స్వరూపం అసలు తెలియనేతెలియదు. వాళ్లు భోజనాలు చేస్తూవుంటే, సరోజినికి పదార్థాలు అందిస్తూ వంటయింట్లో కూర్చుంది సూర్యం మాటలకు పొట్ట చెక్కలయ్యేటంత నవ్వు వచ్చి బిగ్గఱగా నవ్వితే ఎవ్వరేమనుకుంటారో అని ఎంత అణచుకున్నా నవ్వాగలేదు.

ఆ దంపతులను కలిపామనే ఉత్సాహంలో సూర్యానికి ఒళ్లు తెలియడంలేదని సరోజిని అనుకుంది. అతడు తన అదుపులో వుండేవాడు కాదనీ, అతడిని అదుపులో పెట్టే ప్రయత్నం ఫలప్రదంకాదనీ గ్రహించింది. ఆ రోజున తప్ప, తన బావ ఎంత చమత్కారియో సరోజినికి తెలియనే తెలియదు. చమత్కారంగా మాట్లాడడం అనేది అతని స్వభావమనీ, పార్కులో మాట్లాడినా, భోజనాల ముందు మాట్లాడినా, అతని పద్ధతి ఒకటేననీ గ్రహించింది. కాని తనతో ఎప్పుడు మాట్లాడినా ముక్తసరిగా మాట్లాడి వెళ్లిపోయా

**జరిగిన కథ-9:** కొడుకు సూర్యానికి సరోజినిని యిచ్చి పెళ్లి చేయమని అన్న శేషయ్యని అడుగుతుంది చింపమ్మ. ఆస్థి, చదువు లేని సూర్యానికి సరోజినిని యివ్వటానికి ఒప్పుకోడు శేషయ్య. ఉన్న ఆస్థి సరోజిని చదువుకి కరిగిపోగా గత్యంతరం లేక హైస్కూల్లో టీచరుగా చేర్పిస్తాడు శేషయ్య. సూర్యం మంచి పురోహితుడుగా పేరు సంపాదించుకుంటాడు. ప్రయివేటుగా ఎం. ఏ. పూర్తి చేస్తుంది సరోజిని. తను తన భర్తకు ఎలా దూరమయ్యిందీ సరోజినికి చెప్తుంది తోటి టీచరు సురేఖ. తను తన సంపాదన దాచుకోవడం అన్నకి కంటగింపుగా వుందని అతని మాటలవల్ల గ్రహిస్తుంది సురేఖ. సురేఖ తండ్రి మరణిస్తాడు. సురేఖపట్ల పెడసరంగా వుంటుంది వదిన గంగమ్మ. అన్న ఇంటినుండి వెళ్లిపోయి వేరే వుంటుంది సురేఖ. తండ్రి పోయినతర్వాత ఒంటరితనంతో బాధ పడుతుంటుంది సరోజ. సరోజ ప్రోద్బలం మీద వెళ్లిన సూర్యం సురేఖ భర్త రెండో భార్య పోవటంతో ఆమెని స్వీకరించటానికి విముఖతగా లేడని తెలుసుకువస్తాడు. చింపమ్మ మరణిస్తుంది. సూర్యం ఉత్తరానికి సమాధానంగా సురేఖ భర్త రామబ్రహ్మం వస్తానన్న వేళకి సురేఖను ఇంట్లో వంటరిగా వుంచి బయటకు వెళ్లుతుంది సరోజిని సూర్యం సలహాపై.

డనీ, ఈ రోజు సంతోషకరమైన రోజు కనుక అతని స్వభావసిద్ధమైన లక్షణం బయటకు వస్తోం దనీ అనుకుంది.

''బావా ! అంత నవ్వించకూడదు. మీ ఇద్దరి విస్తళ్ళూ కలిసిపోతాయి'' అన్నప్పుడు కొంత నిగ్ర హించుకునేవాడు. ''నువ్వు నవ్విస్తే, నాకు మతి పోయి ఎప్పుడు ఏది వడ్డించాలో మరచిపోతున్నాను బావా !'' అన్నప్పుడు ''సరోజినీ ! నువ్వు ముందు వడ్డించలేదని మేమేమీ అనుకోము. తినడం మానం ఏమండీ ! రామబ్రహ్మంగారూ ! మజ్జిగ పోసుకున్నా మనుకోండి ! పులుసు పోసుకోవడం మరచిపోయా మనుకోండి. వడ్డించుకోమూ ! వండిన పులుసు పారపోసుకుంటామా ?'' అని అంటే ఆయన ''నిజమే'' అంటే, అందరూ నవ్వేవారు.

భోజనాలయిన తర్వాత తాంబూలాలు సేవిం చారు. సూర్యం తాను గుణదల వెళ్ళిపోతున్నానని రామబ్రహ్మంగారితో చెబుతూ. ''అన్నగారూ ! మీరు మీ యింట్లో విశ్రాంతి తీసుకోండి. నేను సెలవు తీసుకుంటున్నాను. ఈ పూట సరోజిని వంట రుచి చూశారా ? రాత్రికి మీ ఆవిడ వంట రుచి చూడండి. ఒక్క పూట ఆవిడ చేతి వంట తింటే, మీరు మీ ఊరు మరచిపోతారు.

పురుషుడు వీణకు తీగలాంటివాడు. రథానికి చక్రంలాంటివాడు. తీగలేనిది వీణ పలుకదు. చక్రం లేనిది రథం నడువదు. ఇప్పుడు మీ జీవిత రథం నడుస్తుంది చక్కగా, మీ జీవిత వీణ పలుకుతుంది కమ్మగా, సంతోషం'' అన్నాడు.

''ఈ మాటలు మీరు బ్రహ్మచారిగా కాక, గృహస్థులుగా చెబితే ఎంతో సంతోషిస్తాను.'' అని వెంటనే అనేశాడు రామబ్రహ్మం. ''ముందు మీ పెళ్లి చేయించింది అందుకేగా !'' అని వెళ్లి పోయాడు సూర్యం. రామబ్రహ్మం, సురేఖా ఒకరి వంక ఒకరు చూసుకొని నవ్వుకున్నారు.

''మా బావ నోటికి అడ్డంలేదు. ఏది పడితే అది అనేస్తాడు'' అని సన్నగా అనుకుని నవ్వుకుంది సరోజిని. సురేఖకు బొట్టుపెట్టి ఒక రవికలగుడ్డ పెట్టింది సరోజిని.

ఒక నిద్రతీసి, రామబ్రహ్మం బిసెంటురోడ్డు కేసి వెళ్ళాడు.

సురేఖ సరోజిని యింటికి వచ్చింది.

''సరోజినీ ! చిన్నదానవయివుండి, గద్దె కదల కుండా, నా భర్తను నా స్థావరానికి రప్పించి, నా జీవితానికి వెలుగిచ్చావు. నీ మేలు మరువలేను. నా చర్మాన్ని చెప్పులు కుట్టించి ఇచ్చినా, నీ ఋణం తీర్చుకోలేను'' అన్నది సురేఖ.

''అక్కా ! కాళ్లు గడపలు దాటని ఆడదానిని నావల్ల ఏమవుతుంది మీరిద్దరూ తిరిగి కలవాలని ఈశ్వర సంకల్పం. ఇక్కడకు వచ్చిన దగ్గరనుంచీ శనివారా లుంటున్నావు కదా ! 'కలే వేంకటనాయకః' అన్నట్లు, పిలిస్తే పలికే దైవం వేంకటేశ్వరస్వామి నిన్ననుగ్రహించాడు. నాది వట్టి సంకల్పమే, ఇంత పని నావల్లకాదు. ఆ దైవం మా బావచేత చేయించాడు.''

''మీ యిద్దరి ఋణమూ మేము ఎల్లా తీర్చుకోగలం ?''

''మీరు సుఖంగా ఉండడంవల్ల. దానికేమి గాని, బావగారిని యెక్కడకు పంపావు ?''

''నేను పంపడమేమిటి, సరో ! కొంగున ముడి వేసుకునేటంత శక్తి నాలో లేదు. వారు ఇక్కడ వుండిపోవడానికి సిద్ధపడి రాలేదు. ఒక్క పంచ, ఒక్క ఉత్తరీయం, ఒక్క చొక్కాతోనే వచ్చారు.

ఇక్కడ వుండాలికదా మరి ! అందుచేత మరొక ధోవతి, పైపంచ, కొనుక్కోడానికీ, మరొక చొక్కా కుట్టించుకోవడానికీ, బిసెంటు రోడ్డుకు వెళ్లారు. గంట గంటన్నరలో లాల్చీ కుట్టివేసి యిస్తారుకదా !''

''డబ్బెవరిది ?''

సురేఖ నవ్వింది.

''ఇంటికి వెళ్లి బట్టలు తెచ్చుకుంటా నన్నారు. ఇక్కడే కొనుక్కోండి, అని నా మనీపర్సు చేతికిచ్చాను. ఆయన నవ్వి, నాదగ్గర డబ్బు వుందిలే అని వెళ్లిపోయారు.''

''మొత్తంమీద, వచ్చిన మనిషిని. కదలనీయ కుండా చేశావు. ప్రజ్ఞ అంటే నీది !''

''లేకపోతే వెళ్లనిస్తానా ఏమిటి? అసలు వారిని చూసి ఎన్నేళ్లయింది ? అన్నేళ్ళూ నా దగ్గర వున్న తర్వాత, అప్పుడూ వారిని వెళ్లనిచ్చే ఆలోచన. జీవితంలో ఏదో వెలితిగా వున్నట్లూ, పని చేస్తుంటే ఏదో మరచిపోయినట్లూ అన్పించేది, చెల్లీ ! చెబితే నువ్వు నవ్వుతావని చెప్పేదాన్ని కాదు. అసలు సృష్టి కర్త ఆడదాన్ని ఎందుకు సృష్టించాడు ? మగవాడి కోసం మగవాడి నెందుకు సృష్టించాడు? ఆడదాని కోసం !''

సరోజిని నవ్వింది.

''నవ్వుతున్నావా, సరోజినీ, నవ్వులే ! అసలు పురుషుడంటే ఏమిటో తెలిస్తేనేకాని, నీకు నా బాధ అర్థం కాదు త్వరలో పెళ్లి అయితే, నీకూ తెలుస్తుందిలే !''

సురేఖ మాటలను, పార్కులో సూర్యం అన్న అనాఘ్రాత పుష్పానివన్న మాటతో జోడించి ఆలో చించింది సరోజిని. ఆడదానికి మగవాడి ఆలంబనం కేవలం మగదిక్కు కోసమే కాకుండా, ఒక అద్భుత మైన అనుభూతికోసం కూడా — అని అనుకుంది. అల్లాంటిదొక అనుభూతి వున్నదని గ్రంథాలవల్ల సరోజినికి తెలిసినా, దానికోసం తపించడం తెలియదు. ఒకమారు అనుభవం పొందిన సురేఖ దానికై తపించడం నేడు సరోజిని చూస్తోంది. సురేఖ ఏళ్లతరబడిగా ఆ అనుభవానికి వెలి అయింది. అయినా తిరిగి ఆ అనుభూతి కావాలనే కాంక్ష ప్రబలంగా వుండడంవల్ల, తన వ్యక్తిత్వం అనేది అసలు లేదనుకొని, భర్త కన్పించగానే ఏడుస్తూ పాదాలమీద పడింది.

''సరోజినీ ! ఏదో గబగబా ప్రొద్దున జరిగిన దాని సారాంశం నీకు చెప్పివేశాను. ఆత్మీయంగా మాట్లాడడానికి అవకాశం చిక్కలేదు.

నేను ఆత్మార్పణం చేసుకున్నానంటే, నాకు ఎంత ఆనందంగా వుందని అనుకున్నావ్ ? శరీరం ఎంతో తేలిక అయిపోయింది. మనస్సులో ఒక బండ దిగిపోయినట్లయింది. నేను వారి పాదాలమీద పడినా, నాకు పడ్డాననే అన్పించలేదు. అసలు నా ప్రత్యేకతనే, నేను ఉపసంహరించుకున్నట్లయింది. కాళ్ల వారివనీ, నేను పడుతున్నాననే భావమే నాకు కలుగలేదు. అంతకాలం ఎడబాటు స్మృతిపథంలో మెసలడంవల్ల దుఃఖం మాత్రం వచ్చింది.

వారు తమ పాదాలమీదనుంచి నన్ను లేవదీసి నపుడు, నాకు ఎంత ఆనందంగా వున్నదనుకున్నావ్? ఒక భక్తుణ్ణి భగవంతుడు అనుగ్రహిస్తే ఎల్లా వుంటుందో అల్లా వుంది. ఆ అనుభవం అనిర్వాచ్యం అనుకో ! మాధవీ లతకు మామిడిచెట్టు ఆధారం దొరికితే ఎల్లా వుంటుందో అల్లా వుంది. జీవితంలో నాకు చింత అనేది లేదని అనిపించింది.''

''అక్కా ! నీకు కవిత్వం వస్తున్నట్లున్నది !''

''నా జీవితమే కవిత్వమయిపోయింది, సరోజినీ !'' అని సురేఖ తనవంక తానే గర్వంగా చూసుకుంది.

''సరోజినీ ! ఇంకొకరి దగ్గర నేను యిలా మాట్లాడను. నీతో హృదయం విప్పి మాట్లాడు తాను. నేను కన్నీళ్లు కారుస్తూ వారి పాదాలమీద పడితే, వారి హృదయం కరగిపోయి, వారికికూడా కంటివెంట నీళ్లు వచ్చినై. వారిది జాలిగుండె సరోజినీ ! చెప్పిందే చెబుతోంది అనుకుంటావా, ఎన్నిమాట్లు చెప్పినా నాకు తృప్తి కలుగదు

సరో ! వారు వచ్చేటప్పటికి నువ్వు యింట్లో వుంటే, నేను అల్లా పడగలిగేదానిని కాదు, ఎంత ఆత్మార్పణం చేసుకోవాలని వున్నా, మాయ సిగ్గు అడ్డం వచ్చేది, సిగ్గనేది ఒకప్పుడు ఆడవాళ్ల కెంత ఆభరణమో, ఒకప్పుడు అంత అవరోధం సరోజినీ ! అందుకనే కృష్ణభగవానుడు గోపికలను సిగ్గు వదలి తేనే చీరలిస్తానన్నాడు.

కాళ్లమీద పడకుండా వుంటే వారూ అంత ఆదరించేవారు కారేమో ! వెనకటివన్నీ త్రవ్వేవారు. వాటికి నా దగ్గర సమాధానాలు లేవు. కాని, ఏదో చెప్పేదాన్ని. న్యాయస్థానంలో దోషిని నిలబెట్టి నట్లుగా నన్ను నిలబెట్టేవారు. కాని యిప్పుడో ! ఎవ్వరూ లేరు. మనస్సులే మాట్లాడుకున్నాయి !''

ఈ చివరి మాటతో సరోజినికి సూర్యం జ్ఞాపకం వచ్చాడు. సరిగ్గా సూర్యం ఆ మాటలే అన్నాడు. అతని అంచనా, వారిని ఏకాంతంలో ఉంచడంలో ఆదే ! అదే విజయాన్ని సాధించింది. 'సూర్యం యెంత తెలివికలవాడు' అనుకుంది సరోజిని.

''నీకింత మంచి వ్యూహం యెల్లా తోచిందో కాని, నువ్వు ఇంట్లో లేకుండా ఉండడం, వారి సంగతి నేనే చూడవలసిరావడం, వారు నేనున్న చోటికే రావడం, అంతా ఒకటవరకంగా కుదిరింది.''

''అక్కా ! ఇదంతా మా బావ వ్యూహమే !''

''అయితే ఆయన నా పాలిటి దేవుడని చెప్పవచ్చు. నా దేవుణ్ణే తీసుకువచ్చి నాకిచ్చాడు. కాని, చెల్లీ ! అసలు సంకల్పం నీదేగా !''

ఇంతట్లో రామబ్రహ్మం, రాజయ్య కలిసి రావడం సురేఖ చూసింది.

''చెల్లీ ! అన్నయ్యా, వారూ, కలిసి వస్తున్నారు. మా యింటికి నేను వెడతాను'' అని తుర్రున వెళ్లిపోయింది.

"ఇద్దరూ అప్పుడే యెల్లా కలిశారా ?" అని సరోజిని ఆశ్చర్యపడింది.

## 26

"రా, అన్నయ్యా !" అని తన గది తలుపు తెరచింది సురేఖ.

"సురేఖా ! మీ ఆయన్ని తీసుకువచ్చాను. బిసెంటు రోడ్డూ, ఏలూరు రోడ్డూ కలిసే కూడలిలో కన్పించాడు. నేనే గుర్తుపట్టి, పలుకరించి, నువ్వు ఇక్కడే దగ్గరలో వుంటున్నావని చెప్పి, వెడదాం రమ్మని తీసుకువచ్చాను."

"సంతోషం, అన్నయ్యా !"

"ఏదో ! మా నాన్న ఉన్నప్పుడు పట్టుదలలు వచ్చినై అనుకో ! ఆయన గతించాడు. మేము వద్దన్నా మా అమ్మాయి విడిగా వుంటానన్నది. అగ్నిసాక్షిగా పెళ్లి చేసుకున్నావు కదా, మా అమ్మాయినికూడా ఏలుకొమ్మని చెప్పాను. ఊరుకున్నాడు, బావగారు. కూడా రమ్మని బలవంతంచేస్తే వచ్చాడు. కాళ్లు కడుక్కుందుకు నీళ్లివ్వమ్మా !"

ఇద్దరికీ రెండు చెంబులతో కాళ్లు కడుక్కునేందుకు నీళ్లిచ్చి, మంచితీర్థం కూడా యిచ్చింది. అన్న మాటలవల్ల తన భర్త అంతకు ముందు ఇక్కడకు వచ్చినట్లు చెప్పలేదని అనుకుంది. తన భర్త గడుసువాడే అనుకుంది. ప్రక్క వాటాలోనుండి యీ ప్రసంగం వింటున్న సరోజినికి పొట్ట చెక్కలయ్యేటంత నవ్వు వచ్చింది. కాని నిగ్రహించుకుంది.

"ఇంకేం ! బావగార్లిద్దరూ ఇక్కడే భోజనం చెయ్యండి" అంది గది బయటకు వచ్చి.

సరోజిని కల్పించుకొని సమయస్ఫూర్తితో అన్న మాటకు సురేఖ యెంతో సంతోషించింది.

"అంతే, అన్నయ్యా !" అంది తడుముకోకుండా

"ఉండకేం చేస్తామమ్మా ! నేనూ ఉంటాను. బావగారూ వుంటారు. అందుకేగా తీసుకొచ్చింది" అన్నాడు రాజయ్య.

"అన్నయ్యా ! నామీద దయచేత నువ్వు వారిని తీసుకువచ్చావు. నీ మాట మన్నించి వారు బిసెంటురోడ్డు నుండి ఇక్కడకు వచ్చారు" అన్నది సురేఖ.

రాజయ్య కళ్లలో నీరు గిర్రున తిరిగింది.

"బావా ! నువ్వు మళ్ళీ పెళ్లి చేసుకున్నావని విని, ముఖం చెల్లక నీదగ్గరకు రాలేకపోయాను. నన్ను మన్నించు. దాసుడి తప్పు దండంతో సరి !"

ఆ రాత్రి భోజనాలయాక రాజయ్య వెడుతూ, "అమ్మా ! నువ్వూ, బావగారూ, రేపు సాయంత్రం బయలుదేరి మాయింటికి రండి. అక్కడ ఒక వారంరోజులపాటు ఉందురుగాని !"

"మీ బావగారి యిష్టం. నాదేముంది ?" అన్నది సురేఖ.

"భార్యాభర్తల సంబంధం ఎంత దృఢమైనది ! వీరిద్దరూ కలిసి ఇరవైనాలుగు గంటలు కాలేదు. సాక్షాత్తు తన అన్న ఆహ్వానిస్తే వెంటనే సరే అనకుండా, భర్త యిష్టం అనేసింది సురేఖ." అనుకుంది ఆ మాటలు విన్న సరోజిని.

"ఇన్నాళ్లకు మనమిద్దరమూ ఇక్కడ కలవాలనీ, ఇది వండితే భుజించాలనీ ఈశ్వర సంకల్పం. అల్లాగే ఈశ్వరాజ్ఞ అయితే మీ ఇంటికే వస్తాం. మీ చెల్లెలు వెడదామంటే నేను కాదంటానా ?" అన్నాడు రామబ్రహ్మం.

రాజయ్య సంతోషంతో వెళ్లిపోయాడు.

రామబ్రహ్మం సంచీలో తాను భద్రంగా దాచిన మల్లెపూల పొట్లం సురేఖ కిచ్చాడు. పొట్లాన్ని చుట్టిన దారాన్ని గబగబా ఊడదీసి ఒక మాల కట్టి వేంకటేశ్వరస్వామి పటానికి వేసింది.

"ఈ స్వామి మనలను కలిపాడండీ ! నేను శనివారాలుంటున్నాను" అని స్వామికి నమస్కరించింది.

"విశ్వాసం చాలా గొప్పది" అన్నాడు రామబ్రహ్మం.

వెంటనే ఇంకొక మల్లెచెండు కట్టి భర్తకోసం విడిగా వుంచింది. మిగతా పూలలో ఒక చెండు కట్టింది సరోజిని కోసం. మిగిలిన పూవులన్నీ పెద్ద చెండు క్రింద కట్టి, తాను పెట్టుకొని, చిన్న చెండు చేతో పుచ్చుకొని సరోజిని తలుపు తట్టింది.



సురేఖ అందాన్నీ, అలంకారాన్నీ చూసి, సరోజిని విభ్రాంతురాలయింది.

"ఇన్నేళ్లూ నీ అందాన్ని కొంతవరకూ, అలంకార కౌశల్యాన్ని పూర్తిగానూ, మరుగుపరుచు కున్నావన్న మాట !" అంది.

"సరో ! ఉద్యోగం చేస్తున్న ఆడవాళ్లు అన్నీ మరుగుపరుచుకోవాలసిందే. లేకపోతే వాళ్ల బ్రతుకు కుక్కలు చింపిన విస్తరి అవుతుంది. చెల్లీ ! నేను పుద్యోగాన్ని ఏడుస్తూ చేస్తున్నాకాని, నవ్వుతూ చేయడంలేదు. భర్తకు కావలసిన సౌకర్యం సమకూరుస్తూ, ఇంటిపట్టున వుండి, యిలా చక్కగా అలంకరించుకోవడంకంటే వేరే ఆనందం వుందంటావా ?"

సరోజిని సురేఖ భావాలు గమనిస్తూ అలా వుండిపోయింది.

"చెల్లీ! బావగారు తెచ్చిన పూలలో నీ కొక చెండు కట్టాను. అది నీ కివ్వకుండా వుంటే, ఈ రాత్రి అల్లా మనస్సులో పీకుతూనే వుంటుంది. నీ కిచ్చాను. నా కెంతో సంతోషంగా వుంది"

సరోజిని అలంకరించుకుంది. ఎన్నో మధుర భావాలు ఆమె హృదయంలో మసలినై.

"సరే! వెళ్ళు అక్కా!" అన్నది బరువుగా. సురేఖ నవ్వింది.

"గదిలోకి వెళ్ళినా మన యిష్టం ఏముంది? అంతా వారి యిష్టమే. ఇవాళ ఆదివారమని పూరుకున్నారమకో! అప్పుడు నాకెంత ప్రాప్తి, అంతే!"

"అక్కా! ఆదివారం విషయం నీవు జ్ఞాపకం చేయకు. ఆయన పూలు తీసుకువచ్చారంటే అది ఆయన దృష్టిలో లేదు."

"అల్లాగా!" అని సురేఖ నవ్వి వెళ్ళిపోయింది.

సరోజిని తలుపు గడియ వేసుకొని, మంచంమీద పడుకొని ఆలోచిస్తోంది.

ఆరోజున జరిగిన సంఘటనలన్నీ ఆమె కళ్ళకు కట్టినై. సురేఖ తన అమూల్యమయిన కాలం, తన భర్తతో గడపలేదని తపిస్తోంది. మరి అవివాహితలు తమ అమూల్యమైన కాలాన్ని యెంత పోగొట్టుకుంటున్నారో! సరోజినికి దుఃఖం వచ్చింది. తలలో పెట్టుకున్న చెండు తీసి బల్లమీద పెట్టింది.

తనకు పెళ్లి సంబంధాలు చూసేవారెవరు? తాను తండ్రికి వివాహం చేసుకుంటానని చేసిన వాగ్దానాన్ని నెరవేర్చేదెల్లా? తనకు పెళ్లి సంబంధాలు చూడమని, సిగ్గువిడచి బావను ఎల్లా అడుగగలదు? సూర్యం సంబంధాలు చూసినా కట్నానికి తన దగ్గర తగినంత డబ్బెక్కడిది? డబ్బు పోగయేదాకా కొన్ని సంవత్సరాలు తన యౌవనం వ్యర్థం కావలసిందే. నిట్టూర్పులు విడుస్తూ సరోజిని నిద్రపోయింది.

* * *

"ఏమండీ! ఇది కలకాదుగా! నేను బ్రదికే వున్నాగా! నా చేత్తో మీకు అన్నం వండిపెట్టడం నా జన్మలో ఇదే మొదలండీ!" అన్నది సంతోషాన్నీ దుఃఖాన్నీ మిశ్రితంచేసి సురేఖ భర్తతో.

"తప్పంతా నీదే అనుకోవడానికి వీలులేదు. నాదికూడా వుంది. నువ్వు మీ నాన్న వద్దిలో మనిషివి. నేను నీదగ్గరకు వచ్చి "నువ్వు కాపురానికి వస్తావా? రావా?" అని సూటిగా నీతో తేల్చుకోలేదు. నీకా అవకాశం యివ్వలేదు. అంటే వచ్చేదానవేమో! జీవితంలో యెంతో మాధుర్యాన్ని పోగొట్టుకున్నాను." అన్నాడు రామబ్రహ్మం.

"ఏమండీ! చెప్పేస్తున్నాను. బాంకులో నాపేర పదివేలున్నాయి. ఈ పుస్తకం మీకిచ్చేస్తున్నా. తీసుకోండి. అన్నయ్య ఇబ్బందిపడితే ఒక వెయ్యి మాత్రం సాయం చేశాను. ఇక నేనే మిగిలాను."

రామబ్రహ్మం బాంకు పుస్తకం చూశాడు.

"నీ డబ్బుమీద నాకేమీ ఆశలేదు" అన్నాడు.

"మీరు వుద్యోగం చెయ్యమంటే చేస్తాను. వద్దంటే మానివేస్తాను. మనింటికి మనం వెళ్లిపోదాం హాయిగా, ఇకమాత్రం మిమ్మల్ని విడచి నేనుండలేను. నన్ను కోసినా, మిమ్మల్ని వదలి ఎక్కడకూ వెళ్లను.

ఉద్యోగం చెయ్యమని మీరు అనే పక్షంలో, అబ్బాయి, అత్తయ్యా, మీరూ, నా దగ్గర వుంటూ నంటేనే చేస్తాను."

"నువ్వు మంచిదానవని తెలియడానికి నాకు ఎంతకాలం పట్టింది!" అని రామబ్రహ్మం సురేఖను కౌగలించుకున్నాడు. సురేఖ తెల్లవారేదాకా పారవశ్యంలోనే వుండిపోయింది.

## 27

సురేఖా, రామబ్రహ్మం, రాజయ్య యింటికి వెళ్లి వారం రోజులున్నారు.

"సరోజినీ! మా గంగమ్మ వదినె నాకు చాలా మర్యాద చేసింది" అన్నది సురేఖ యింటికి వచ్చిన తర్వాత —

"అక్కా! అంత మార్పుకు కారణం, నీవు ద్రవ్య సహాయము చేయడమా? మీ అన్న మళ్లీ మర్దిస్తాడనా?"

"సరో! అవి కొంతవరకే హేతువులు. అసలు హేతువు వేరే వుంది. నేను తన పెనిమిటికి తోబుట్టువును అయినా, సొమ్ము పెట్టినా, పనిలో సహాయపడినా, నా భర్తకు నేను దూరం కావడం చేత లోగడ గౌరవం లేదు ఇప్పుడు నా కొక గొడుగు వుంది. మనిషిని వెనుకటి మనిషినే కావచ్చు. భర్తృ సమేతంగా వెళ్లడం జరిగింది. అందుచేత తళుకు వచ్చింది.

ఇదివరకు చూపు, తనకే యిల్లూ, బిడ్డా పాపా వున్నారని. ఇప్పుడు నాకూ యిల్లు వున్నది. బిడ్డా పాపా కలగడానికి అవకాశం వున్నది. అందుచేత దృక్పథంలో మార్పు తప్పదు. పైగా మా ఉభయులకూ నూతన వస్త్రాలు పెట్టారు. ఈ పరిణామాలన్నీ భాగ్యం అక్కకు వ్రాశాను. ఆమె యీ శుభ వర్తమానాన్ని బంధువర్గానికి తెలియపరచివుంటుంది."

"అక్కా! ఇప్పుడు తళుకు వచ్చిందన్నావే! నీ ముఖంలోకూడా తళుకు వచ్చింది. స్కూలులో చూస్తూవున్నా, యీ వారంరోజులూ పరిశీలనగా చూసే అవకాశం చిక్కలేదు.

నువ్వే అన్నావుకూడా — 'సరోజినీ! ఏమీ అనుకోకు. నీతో కాలం వుచ్చడంలేదని. వారు యింటిదగ్గర నాకోసం ఎదురుచూస్తూవుంటారు నీతో మాట్లాడుతూవున్నా ఇంటిదగ్గర వారేమి చేస్తున్నారో, వారికి సౌకర్యాలు జరుగుతున్నయ్యో లేదో అని నా మనస్సు ఎప్పుడూ అక్కడే సంచారం చేస్తూ వుంటుందని.'

ఆరోజున నీవు అలంకరించుకున్నావు. స్వభావంగా అందమయినదానవు కనుక అందంగా వున్నావనుకున్నాను. కాని ఇప్పు డలంకరించుకోక పోయినా మెఱిసిపోతున్నావు."

"ఓ! అదా! కొన్నాళ్లపోతే నీకే తెలుస్తుందిలే! నువ్వూ తళతళలాడుతూవుంటావు. ఏ వయస్సులో ఉచితమైన అనుభవం ఆ వయస్సులో వుంటే, వయస్సు పెరిగినా, పిల్లల తల్లులయినా, ఆ తళతళ కన్పిస్తూనే వుంటుంది. లోపల సంతోషం ఎంత దాచుకుందామనుకున్నా దాగదు. ఆ తళతళ కొంత శరీరానికి సంబంధించినది, కొంత మనస్సుకు సంబంధించినది. అది తొంగిచూస్తూనే వుంటుంది"

"అక్కా! నువ్వు ఏమీ దాచుకోవు. మనస్సు విప్పి మాట్లాడుతావు. నాకు నిన్ను చూస్తే అందుకు సంతోషం!"

"సరో! నీదగ్గరే! అందరిదగ్గరా ఇల్లా మాట్లాడను. మాట్లాడితే చెవులకు తాటాకులు కడతారు, పిచ్చిదంటారు.'

"అక్కా! యీపూట సెలవు పెడుతున్నాను. ఈ సెలవుచీటీ స్కూలులో ఇచ్చేయి. ఒంట్లో అంత బాగాలేదు" అన్నది సరోజిని.

సురేఖ చీటీ తీసుకొని స్కూలుకు వెళ్లబోతూ "బావగారు ఆ దారిని అల్లాగే మా ఊరు వెళ్లిపోయారు వెళ్లేటప్పుడు మీ బావకు కృతజ్ఞత చెప్పి వెడతానన్నారు. ముఖ్యంగా నీకు కృతజ్ఞతలు నన్ను చెప్పమన్నారు. నిన్నెంతో మెచ్చుకున్నారు. త్వరలో వివాహ ప్రాప్తి కలుగగలదని ఆశిస్తున్నా నన్నారు" అన్నది.

సరోజిని ఈ లాంఛనాలన్నీ పట్టించుకోలేదు. ఆమెకు పట్టిందల్లా, అగ్నిపుటం పెడితే సువర్ణానికి వచ్చిన కాంతివంటి కాంతి, సురేఖ ముఖంలో నృత్యం చేస్తున్నదనీ, ఆమె కళ్లలోని విషాద రేఖ అంతరించిపోయిందనీ, ఆ విషాదరేఖ కొంపతీసి తనలో ప్రవేశించలేదుకదా?

వెంటనే వెళ్లి అద్దంలో ప్రతిబింబం చూచుకొని నీరు కారిపోయింది. తాను సురేఖ కంటె

---

### ప్రజాసందోహం

— డాక్టర్ దాశరథి

ఎందుకు నీకా సందేహం?
అదంతా ప్రజాసందోహం!
అక్షరాస్యులూ
నిరక్షరకుక్షులూ
అంతంతమాత్రం ఆదాయాలవాళ్ళు
అసలు ఆదాయమంటూ యెరగనివాళ్ళు
చలిని పులిగా భావించేవారు
చలిని వెలిగా లాలించేవారు
అట్టడుగున వున్నవారు
ఆకాశాన్ని అందుకున్నవారు
ఎన్నికలొచ్చాయనగానే
యెంతో సంతోషిస్తున్నారు;
దేశ జనులు ఈనాడు
తెలివిమీరి వున్నారు
వారి మాట వింటున్నారు
వీరి మాట వింటున్నారు
ఎవరు ఎవరో తెలుసుకుంటున్నారు
ఒకరినొకరు కలుసుకుంటున్నారు
మన్నిక గల ఎన్నిక
మన దేశానికి జీవిక.

# * సినిమా విశేషాలు *

## "అన్నపూర్ణ"లో ముగ్గురు "మహా"లు

భారత చలనచిత్ర రంగం గర్వించదగిన ఆయిదారుగురిలో శివాజీ... అక్కినేని... నందమూరి గార్లు ముఖ్యులు.

అన్నపూర్ణలో యీ ముగ్గురు కలిసి నటించడం అపురూపమైన విషయమేగదా!

మార్చి యిరవై మూడున అన్నపూర్ణలో ముగ్గురు "మహా"లు ప్రవేశించడం ప్రేక్షక లోకానికి తనివితీరని ఆనందాన్ని యివ్వగలదు.

ఇట్టి అమోఘమైన కలయికను సాధించిన "నటరత్న" ఎంతేని అభినందనీయుడు. చాణక్య పాత్రను అక్కినేని, చంద్రగుప్త పాత్రను నందమూరి, అలెగ్జాండర్ పాత్రను శివాజీ పోషించడం ముదావహం. ఈ చిత్రం "షోలే" లెవల్‌ను దాటినా ఆశ్చర్యం లేదు.

అన్నపూర్ణలో అనేసరికి వేరే విధంగా అనుకునే అవకాశం వుంది. అక్కినేనిగారి స్టుడియోలో ముగ్గురు "పద్మశ్రీ"లు నటించే సన్నివేశాలు చిత్రీకరించబడ్డాయి.

## ఎన్టీఆర్ భారీ వర్ణపథకాలు

లైబ్రరీలో వుంచదగిన వుత్తమ జాతి చిత్రాలను మాత్రమే నిర్మించాలని నిర్ణయించారు, "నటరత్న" రామారావు, జనవరి నెలలో విడుదలయిన కర్ణ చిత్రం ఘనవిజయాన్ని సాధించింది. జూన్‌లో విడుదలయ్యే "చాణక్య... చంద్రగుప్త" అద్వితీయ విజయాన్ని సాధిస్తుంది. ప్రేక్షకుల మంచిమనసు తనకు "శ్రీరామరక్ష" అంటారు నందమూరి.

"కర్ణ... చాణక్య"ల వలె మరో రెండు భారీ వర్ణ చిత్రాలను ఎన్టీఆర్ ఆంధ్ర ప్రేక్షకులకు సమర్పించబోతున్నారు. ఒకటి "శ్రీరామ పట్టాభిషేకం" రెండోది వెంకటేశ్వర మహాత్మ్యం.

ప్రముఖ దర్శకుడు పుల్లయ్యగారు రూపొందించిన "వెంకటేశ్వర మహాత్మ్యం" చిత్రంలో ఎన్టీఆర్ శ్రీనివాసుడుగా నటించిన మనోహర దృశ్యాలను యిప్పటికీ, ఎప్పటికీ మరిచిపోలేము. ఆంధ్రులకు... ఆంధ్రేతరులకు తిరుపతి దేవుడు ఎంత ముఖ్యుడో... తెలుగు చలనచిత్ర రంగానికి దేవుడి పాత్రలకు "నటరత్న" అంత ముఖ్యుడు.

ఎన్టీఆర్ నిర్మించనున్న "వేంకటేశ్వర మహాత్మ్యం" వైభవోపేతంగా వుంటుంది.

## బి. ఏ. ఎస్. కు భలే ఆఫర్

మనకున్న మంచి దర్శకులలో బి. ఏ. సుబ్బారావుగారొకరు. ఆయన అందించిన వుత్తమ చిత్రాలను గూర్చి ఒక్క క్షణం ఆలోచిస్తే... అట్టి ప్రతిభావంతుడిని పరిశ్రమ ఎందుకు చిన్నచూపు చూస్తుందో, అర్థంగాకుండా వుంది.

"నటరత్న"గారికి బి. ఏ. ఎస్. ప్రతిభపట్ల మొదట్నుంచి ప్రగాఢ నమ్మకం వుండబట్టే, అవకాశం వచ్చినప్పుడల్లా, ఆయన్ను సిఫారస్ చెయ్యడం జరుగుతూవుంది.

ప్రముఖ చిత్ర నిర్మాత "లవకుశ" ఫేమ్ శంకరరెడ్డిగారు "ఎన్టీఆర్...వాణిశ్రీ"గార్లతో భారీ ఎత్తున నిర్మిస్తున్న "సతీ సావిత్రి" వర్ణ చిత్రానికి బి. ఏ. సుబ్బారావు దర్శకుడుగా ఎంపికఅయ్యారు.

ఈ పౌరాణిక చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచన్ను, పెండ్యాల సంగీతాన్ని సమకూరుస్తున్నారు.

సత్యవంతుడి పాత్రను, ఒక ప్రముఖ నాయకుడు పోషించగలరని తెలుస్తోంది.

## మార్చి 17 న ఆలుమగలు

ప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్ రంగుల్లో నిర్మించిన "ఆలుమగలు" చిత్రం మార్చి 17 న విడుదల అయ్యేవిధంగా, నిర్మాత ఏ. ఏ. సుబ్బారావుగారు కార్యక్రమాన్ని రూపొందించారు.

"అగ్రద్వయం" అంటే అక్కినేని...వాణిశ్రీ మరొకసారి "నువ్వా ... నేనా" అని పోటీపడి నటించిన "ఆలుమగలు" వర్ణ చిత్రం, దర్శకుడు తాతినేనిరామారావు ఆంతస్తును పెంచేదితథ్యము అని పరిశ్రమ అంటున్నవార్తను, ప్రేక్షకులు అవుననగలరు.



'జీవితంలో వసంతం'లో ప్రభ, చంద్రకళ

ఈ కుటుంబగాథా చిత్రంలో గుమ్మడి ... నాగభూషణం ... రాజబాబు ... రమాప్రభ...అల్లు రామలింగయ్య ... రోజారమణి ... లక్ష్మీకాంత్ ... నారాయణరావు ... రోజాకుమారి ... విజయలలిత... జయమాలిని ... హలం ... అనిత వంటి పేరున్న తారలు సహాయ పాత్రలను పోషించారు.

పి. ఏ. పి. కి ఎప్పటివలె చలపతిరావు "స్పెషల్ కేర్" తీసుకున్న నిజాన్ని శ్రోతలు ఒప్పుకుంటారు. నిర్మాత ఏ. వి. సుబ్బారావుగారికి శుక్రదశ యోగాన్ని యిచ్చే అర్హత "ఆలుమగలు" చిత్రానికి వుంది. నవయుగ విడుదల.

( 26 వ పేజీ చూడండి)

---

వయసులో చిన్నదే అయినా, తన ముఖం పొగచూరినట్లుగా పెంకు కట్టినట్లుగా కన్పించింది. తన ముఖమే యిల్లా వుందా? యుక్తవయస్సు వచ్చి వివాహం కాని మహిళామణుల ముఖాలన్నీ యిల్లాగే వుంటయ్యా? అని ప్రశ్నించుకుంది.

ముసలితనం ముందు మనస్సుకు వస్తోందేమో అనిపించింది. శరీరంమీద దాని ప్రభావం వున్నదా? అని తిరిగి అద్దం చూసుకుంది. వెంట్రుక ఒక్కటయినా నరసినట్లు లేదు. "అమ్మయ్య! బ్రతికి పోయాను!" అనుకుంది.

తన కళ్లు తనవంకకే బెంగ బెంగగా చూస్తున్నట్లు కన్పించాయి. చూసుకొన్నకొద్దీ భయం ఎక్కువయింది వెంటనే గట్టిగా కళ్లు మూసేసుకుంది. ఎల్లాగో అల్లా వచ్చి మంచంమీద బోర్లా పడుకుంది.

"బావ చాలా విచిత్రమైన మనిషి. ఈ దంపతుల సంగతి నేను చెప్పేదాకా అతనికి తెలియదు. సాయం కోరాను. చేశాడు. ఆ పని కాగానే నిర్లిప్తంగా వెళ్లిపోయాడు. మళ్లీ రాలేదు. అత్త బ్రతికి వున్నప్పుడు చాలా అరుదుగా వచ్చేవాడు. సాధారణంగా పని లేనిది వచ్చేవాడుకాదు. ఇటీవల యోగక్షేమాలు కనుక్కోవడానికి ఎప్పుడయినా వస్తున్నాడు. సురేఖ రక్త బంధుత్వాన్ని పురస్కరించుకొని అన్నకు వేయి రూపాయలు సాయం చేసింది -- 'దేహి' అని అన్న అప్పడిగితే. నాకు బావ రక్తబంధువే. కాని ఆత్మాభిమానం కలవాడు. ఏమీ అడగడు. పాపం! అతను పేదవాడే! నేనేమీ సహాయం చేయలేకపోయాను!" అని అనుకుంటూ వుండగా, తలుపు తట్టినట్లయింది. [ఇంకా వుంది]



హమ్మయ్య, యీ కథ వ్రాయడం యిప్పటికి పూర్తయింది — అంటూ ఒక్క నిట్టూర్పు విడిచాను. ఇక ఆనవాయితీగా వ్రాయవలసినది వ్రాయడం మొదలుపెట్టాను. ఈ రచన నా స్వంతమేనని యిందు లిఖితపూర్వకముగా తెలియజేయుచున్నాను. ఈ కథ దేనికీ అనువాదమూ, అనుసరణా కాదు. ఈ రచనను మీరు ప్రచురించని యెడల నాయందు దయవుంచి, నేను పంపు నా స్వంత చిరునామా గల కవరునందు త్రిప్పి పంపగలరు.

ఇట్లు,
సు జ న.

ఇక యీ సుపుత్రికను అత్తవారింటికి పంపే సన్నాహాల్లో మునిగిపోయాన్నేను. నా భావానికి రూపకల్పన చేయడం, దాన్ని "పువ్వులరాణి" వారపత్రికను పంపడం సక్రమంగా జరిగిపోయాయి. ఇక ఆ కథ ప్రచురణకై పట్టువదలని విక్రమార్కుడిలా కూర్చున్నాను ఎదురుచూస్తూ —

*  *  *

"పోస్ట్!"

చదువుతున్న నవలక్కడే పారేసి, ఒక్క గంతులో పోస్ట్‌మెన్ వద్దకు దూకాను. పత్రిక చూడగానే నాలోని ఆనందం సముద్ర కెరటాల్లా ఎగిసిపడసాగాయి. వెంటనే ఆ పత్రికలో ప్రచురితమైన నా కథను ఎన్నిసార్లు చదివానో నాకే తెలియదు. మావారందరూ ఒకటే పొగిడెయ్యటమే.

"డాడీ! డాడీ!!"

"వాట్, సుజనా? వాట్ హేపెండ్?"

"మొట్టమొదటిసారిగా నా కథ అచ్చయింది డాడీ!"

"ఏమిటే, నీ కథ అచ్చయిందా? వెరీగుడ్, మై సుజనా యూ ఆర్ ఎ గ్రేట్ రైటర్! సుజనా మన భారతదేశంలో వున్న రచయిత, రచయిత్రులందరినీ తలదన్నేటటువంటి రచనలు చేయాలి... చేసితీరాలి. విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్!" అంటూ నాన్నగారు నన్ను కొండెక్కించేసారు.

రెండు వారాల తర్వాత —

"సుజనా! సుజనా!!" అంటూ గోల చేయసాగింది చెల్లాయి.

"ఏమిటే, ప్రొద్దుటే నీ గోల?" చిరాకుపడసాగాన్నేను.

"గోలంటావేమిటి నీ. తలకాయ్, యిది చూడు!" అంటూ ఉత్తరాల శీర్షికలో పాఠకుల ఉత్తరాలు చూపించింది.

మొదటి ఉత్తరం చదివిన నా మనస్సు ఒక్కసారి గతుక్కుమంది. పాతాళంలోకి కృంగిపోయే

ఉత్తరం చదవసాగాను.

రచయిత్రి సుజనగారు వ్రాసిన ''ఆశ్చర్యం'' కథ చాల బాగుంది. వాస్తవానికి అతిదగ్గరగా వుంటూ, నేటి సమాజంలో జరిగే, జరుగుచున్న నగ్న సత్యాలను నగ్నంగా చూపెట్టిన ప్రతిభ అతి ప్రశంసనీయంగా వుంది. ''రచయిత్రి''కి మా అభినందనలు.

గియ్యాళి గౌరమ్మ,
గంపలగూడెం.

ఈ వారం ముఖచిత్రం అతి సుందరంగా వుంది. ముఖ్యంగా కథలోకెల్లా ''ఆశ్చర్యం'' కథ మా మనసుల్ని కదలించివేసిందంటే అతిశయోక్తి కాదు అటు హాస్యంతో, యిటు విషాదంతో కథ చక్కగా వుంది. కథ నడిపిన తీరులో నవ్యత గోచరించింది. రచయిత్రిగారు బహు ప్రశంసనీయముగా రూపకల్పన చేసారు. భవిష్యత్తులో చాల అభివృద్ధిలోనికి రాగల రచయిత్రి యీమె!

అబద్దాల అప్పారావు,
అజ్ఞాతపురం.

ఈ రెండు వుత్తరాలు చదివేసరికే నా తల తిరిగిపోసాగింది. బరువెక్కిన హృదయంతో మూడో వుత్తరం చదవసాగాను

మా యింటిల్లిపాదిని ఆశ్చర్యంలో ముంచెత్తిన ''ఆశ్చర్యం'' కథ చాల ఆశ్చర్యంగా వుంది. కథ చివరలో అలా మలుపు తిరుగుతుందని మేమెవరమూ వూహించలేదు. ఈ వారం ''ఆశ్చర్యం'' కథ మీ (మా) పత్రికకే హైలైట్. రచయిత్రి సుజన గారు చాల బాగా వ్రాయగలిగారు. ఆమె వూహకు దర్పణం పట్టినట్టుందీ కథ. రచయిత్రికి మా అభినందనలు.

ముక్కోపి ముకుందం,
మూడుచెఱువులపాలెం.

''అయ్యబాబోయ్, యీ పాఠకులందరూ నా కొంప ముంచేసారు!'' అంటూ తల పట్టుకుని ఏడ్వసాగాను. ఎక్కడ చూసినా రచయిత్రి... రచయిత్రి అంటూ ఆకాశాని కెత్తేస్తోరా బాబూ - నెత్తీ నోరూ మొత్తుకుంటున్న నాకు చెల్లాయ్ అభయమిస్తున్నట్టుగా నా కన్నీరు తుడిచి —

''సుజనా! నీ కెందుకు, నీ మొట్టమొదటి కథకే యింత పబ్లిసిటీ వచ్చిందే! యింకేం, బోలెడన్ని కథలు వ్రాసెయ్, నీ పేరు ఆంధ్రదేశం అంతటా మ్రోగిపోతుంది. 'రచయిత్రి' సంగతంటావా, నీకేం ఫర్వాలేదు కాలమే అన్ని సమస్యల్నీ పరిష్కరిస్తుంది. కథలూ, నవలలూ, వ్యాసాలు వ్రాసెయ్, యిదివరకు వ్రాసిన పాత చెత్తంతా బయటకి తియ్. వాటన్నిటినీ ఫెయిర్ చెయ్యి, పేరు తెచ్చుకో, విష్ యు బెస్ట్ ఆఫ్ లక్ —'' చెల్లాయి మాటలతో మరల నాలో చైతన్యం పరవళ్ళు త్రొక్కింది. నిజమే మానవులు పరిష్కరించలేని సమస్యల్ని ఆ కాలమే పరిష్కరిస్తుంది — అనుకున్నాను.

ఇక నా కలం విజృంభించింది. నాలో ఆవేశం ఉప్పొంగిపోయింది. అగ్గిపుల్ల దగ్గర్నుండి స్మగ్లింగ్ వరకూ నాకు కథావస్తువులే! బోలెడన్ని కథలు వ్రాసేసాను. నవల్ని వ్రాయడం మొదలుపెట్టాను.

— ఆంధ్రదేశం అంతటా మారుమ్రోగిపోసాగింది. కాని నా గుండెల్లో ఎందుకో ఒక మూల నుండి భయం, బెరుకు తొంగి చూస్తూనే వున్నాయి.

ఒక మంచి నవల వ్రాసి దీపావళి కథల పోటీకి ''నవ్వుల వాణి'' ప్రముఖ వార పత్రికకు పంపాను. ఎప్పుడు చూసినా అదృష్టం కాలికే తగులుతుంది. నా నవల ''ఎదురు చూడని అదృష్టం''కు మొదటి బహుమతి వచ్చినట్లు టెలిగ్రాంచూసిన నా మనస్సు ఆనంద డోలికలలో తేలియాడిపోసాగింది. మా యింటిల్లిపాదీ ఆనంద రసాబ్ధిలో మునిగిపోయారు.

ఇంతలో ఎడిటర్‌గారి దగ్గర్నుండి లెటర్ వచ్చింది.

రచయిత్రి సుజనగార్కి!

మీ నవల 'ఎదురు చూడని అదృష్టం'కు మొదటి బహుమతి ఐదువేల రూపాయలు వచ్చినట్లు తెలియజేసాము. అందుకు మేమెంతో సంతోషిస్తున్నాము. మీ ఫొటో, జీవిత విశేషాలు పంపితే ప్రచురిస్తాము.

ఇట్లు,
ఎడిటర్.

ఈ లెటర్ చూడగానే నా గుండెల్లో రాయి పడింది. గుట్టు బట్టబయలవుతుందేమోనని గుండె దడదడలాడసాగింది. ఆఖరికి ధైర్యంచేసి మరల ఎడిటర్‌గార్కి రిప్లయ్ వ్రాసాను.

> వ్యక్తులపేర మీ రచనలు పంపితే వాటి పరిశీలనలో ఆలస్యం జరిగే ప్రమాదాలెక్కువ కనుక మీ రచనలన్నీ కూడా శీర్షిక పేరు కవరుపైన లేదా కార్డుపైన ఉదాహరిస్తూ సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 520003 అన్న చిరునామాకి పంపండి. సం

ఎడిటర్‌గార్కి,

నా నవలకు ప్రథమ బహుమతి వచ్చినందులకు చాల సంతోషం. కానీ మీరు ఫొటో, జీవిత విశేషాలూ పంపమన్నారు. నేను యిప్పుడిప్పుడే అభివృద్ధిలోకి వచ్చుచున్నాను. ఇంత తొందరలో నన్ను నేను పరిచయం చేసుకోవడము నాకు యిష్టం లేదు. కావున నేను మీ కోర్కెను అంగీకరించనందులకు చాల విచారిస్తున్నాను.

ఇట్లు,
సుజన.

ఇలా యీ గండం గడిచినందుకు శతకోటి దేవతలకు ప్రార్థన చేసాను.

కాలం అనేది ఎవరికోసమూ ఆగదు. ఆ కాల ప్రవాహినిలో రచయిత్రి సుజనగా నాపేరు మరింత వ్యాపించింది. ఏ పత్రికలో చూసినా పాఠకులందరూ నా ఫొటో కోరేవాళ్లే!

ఉగాది నవలల పోటీకి మరొక నవలను పోటీకి పంపాను. ఆ నవల పేరు ''బయల్పడిన నిజం''— ఒక ప్రముఖ వార పత్రికకు పంపడం, నా జాతకం బాగుండి దానికి ద్వితీయ బహుమతి రావడం జరిగింది.

ఈ సారి యీ ఎడిటర్ దగ్గర్నుండి నా 'ఫొటో' కొరకై కొంచెం ఘాటైన ఉత్తరమే వచ్చింది. ఈ సారి నా పాస్‌పోర్టు సైజు ఫొటో పంపక తప్పేది కాదు. ఆ ఫొటో పంపినరోజు నుండి నా గుండెలు లబ్ డబ్ అనడం పోయి దడ...దడా — దడ...దడా కొట్టుకొనసాగాయి.

* * *

యధాలాపంగా పత్రిక తిరగవేస్తున్న నాకు - నా కళ్ళు ఒక చోట నిల్చిపోయాయి. నెమ్మదిగ చదవసాగాను —

''పాఠకలోకాన్ని అత్యంతాశ్చర్యంలో ముంచెత్తే గొప్ప నగ్న సత్యం''— వచ్చేవారం పత్రికకై ఎదురు చూడండి —

''ఏంటబ్బా యీ నగ్న సత్యం ?'' నా మనస్సు పరిపరి విధాల పోసాగింది. కొంపదీసి మన విషయమే కాదుగదా! వచ్చేవారం పత్రికకై ఎదురు చూడసాగాను.

రానే వచ్చింది ఆరోజు — గబగబా పేజీలు తిరగవేస్తున్న నేను — పాఠకలోకాన్ని ఆశ్చర్యముతో ముంచెత్తే గొప్ప నగ్న సత్యం — రచయిత్రి (త) సుజనగారి ఫొటో, జీవిత విశేషాలు 34వ పేజీలో చూడండి!

నా గుండె గతుక్కుమంది. మెదడు మొద్దుబారిపోయింది. వెంటనే గబగబా 34వ పేజీ తెరిచాను. ''ఆ'' ఒక్కసారిగా మూర్ఛ వచ్చినంతపనైంది నాకు. యిలా జరుగుతుందని ముందే తెలిసినా 'నగ్న సత్యం' కళ్ళముందు కనబడేసరికి మతిపోయింది.

నాదే ఆ ఫొటో — నవ్వులు చిందించే అందమైన టీనేజ్ అబ్బాయ్!

''జీవిత విశేషాలు! మంకర జక్కా నరశింహం అనబడే యీయన కలంపేరే 'సుజన' యింతకాలం పాఠకలోకం 'రచయిత్రి'గా భ్రమసే యీయన 'రచయిత'నే నిజం యిప్పుడే బయల్పడింది. యీయన వ్రాసిన ''బయల్పడిన నిజం'' నవల యీ వారం నుండే ప్రచురిస్తున్నందుకు సంతోషిస్తున్నాము. ఈయన యింకా...'' యిక ఆ పైన చదవలేకపోయాను.

నా మనస్సు ఒక్కసారి గతంలోకి పరుగెట్టింది. కథలు వ్రాసీ...వ్రాసీ ఎన్నో పత్రికలకు పంపేవాడిని. ఒక్కటీ అచ్చయ్యేదికాదు. చివరికి విసిగిపోయి నాపేరునే సింపుల్‌గా 'సుజన'గా పెన్‌నేమ్ పెట్టి కథ పంపడం, అది అచ్చవ్వడం జరిగిపోయింది. నే నెక్కడా 'రచయిత్రి'ననే పాఠకులకుగానీ, ఎడిటర్లకుగానీ చెప్పడం, వ్రాయడం జరగలేదు. ఆ పేరునుబట్టి వాళ్ళే రచయిత్రిని చేసేసారు నన్ను. మా యింట్లో వాళ్లందరికీ 'సుజన' అని పిలవడం అలవాటయిపోయింది.

* * *

హరి భగవంతుడా, యీ పాఠకులందరూ నానా తిప్పలుపడి పెట్టారుకదరా, మళ్ళీ దీనిపై ఏం విమర్శలు వస్తాయో ఎదురు చూడొద్దూ!

''సుజనా! నీ సీరియల్ 'బయల్పడిన నిజం' చాల బాగుందిరా!'' అంటూ వచ్చింది చెల్లాయ్!





[illegible]

'రాగాలు అనురాగాలు'

'ఇదెక్కడి న్యాయం'

### జగపతి చిత్రానికి అనేకుల ప్రశంసలు

జగపతి అధినేత ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన ''బంగారు బొమ్మలు'' చిత్రాన్ని ప్రేక్షకులు ఎంత ఆసక్తితో ఎదురు చూస్తున్నారో, యిక్కడ కొనడానికి వచ్చేవాళ్ళు అంత ఆనందాన్ని వెల్లడిస్తున్నారు. చూచినవారందరు ''సింప్లీ సుపర్బ్'' అనెడి మాటను చెప్పడం, చిత్రం యొక్క వైభవాన్ని నిరూపిస్తుంది.

బంగారు బొమ్మలు వర్ణచిత్రంలో ప్రేక్షకులకు నచ్చే అంశాలు కో...కొల్లలుగా వున్నాయి. అక్కినేనిగారి అందాలు చిందే అభినయ కౌశలం, మంజులగారి ముగ్ధమోహన రూపం, రావు గోపాలరావుగారి యిద్దరి పెళ్ళాల సరస విరసం, జగ్గయ్యగారి గంభీరత, సత్యనారాయణగారి హుందాతనం, సూర్యకాంతం ... ఛాయాదేవిగార్ల హాస్యం ''బంగారు బొమ్మలు'' చిత్రానికి వన్నె తెచ్చాయి.

సాంకేతికంగా వెంకటరత్నం, మహదేవన్, ఆచార్య ఆత్రేయ, సంజీవిగార్ల బలప్రదర్శనం వుండనేవుంది.

అందరినీ ఆకర్షించే కధను ఎంపిక చెయ్యడంలో దర్శకుడు రాజేంద్రప్రసాద్‌గారు విజయుడు అని మరొకసారి ఋజువు అవుతుంది, బంగారు బొమ్మలు చిత్రం ద్వారా.

అన్నపూర్ణా పిలింస్ విడుదల.

### అక్కినేనికి డాక్టరేట్

ఆంధ్రా యూనివర్శిటీ మన అక్కినేనికి ''డాక్టరేట్'' బిరుదాన్ని ప్రకటించడం మనసున్న ప్రతి మనిషి ఆనందించదగిన విషయం.



'ప్రేమ లేఖలు'లో జయ, అనంతనాగ్

# సినిమా

(23 వ పేజీ తరువాయి)

ఒక సమర్ధునికి, ఒక మానవతావాదికి, ఒక మంచిమనిషికి, ఒక తపస్వికి, ఒక చరిత్రకారుడికి కళాప్రపూర్ణ బిరుదు రావడం, ముదావహం ...

కళాప్రపూర్ణ బిరుదానికి వేల్యూ పెరిగింది. అక్కినేనివంటి మహామనీషికి యిలాంటి సత్కారం సరయిన సమయంలో జరగడం, హర్షణీయం.

ఇప్పుడు అక్కినేనికి మూడు అమూల్యమైన బిరుదులున్నాయి. కళాప్రపూర్ణ ... నటసామ్రాట్ ... పద్మశ్రీలే ఆ మూడు బిరుదులు.

### సురేష్‌కు శ్రీరామచిత్రకు

సుగుణా పిక్చర్స్ వారి వర్ణ చిత్రం షూటింగు పూర్తయ్యే తరుణంలో, యిద్దరికి అక్కినేని కాల్‌షీట్లు యివ్వడానికి నిర్ణయించారు. శ్రీరామ చిత్ర సుకుమార్‌గారికి, సురేష్ రామానాయుడుగారికి.

మొదటి చిత్రానికి బాపు ...ముళ్ళపూడి ... ఇషాన్ ఆర్య ... మహదేవన్ ... ఎమ్వీయల్ ముఖ్యసారధులు.

రెండో చిత్రానికి రామానాయుడు, ఆచార్య ఆత్రేయ ... మహదేవన్ ... కె. ఎస్. ప్రకాశరావు ప్రధాన సారధులు.

మార్చి ఇరవై నుంచి శ్రీరామచిత్రకు, జూన్ నుంచి సురేష్‌కు పని చెయ్యబోతున్నట్లు, అక్కినేని యీ విలేఖరితో చెప్పారు.



## తొలి షెడ్యూలు యిచ్చిన దెంత ?

సుగుణా పిక్చర్స్ రంగుల్లో నిర్మిస్తున్న సంగీత నృత్య వైభవం తొలి షెడ్యూలు పూర్తయ్యే

'ఓ మనిషీ తిరిగి చూడు'

నరికి ఏడు రీళ్ల చిత్రం వచ్చింది అనెడి వార్తను, నిర్మాత ఎమ్. శేషగిరిరావు చెప్పారు.

"నటసామ్రాట్" సకలకళా పారంగతుడుగా నటిస్తున్న శేషగిరిరావుగారి చిత్రంలో "అగ్రనటి" మహారాణిగా నటించడం గమనించదగ్గ విషయం.

"విక్టరీ ... ఆత్రేయ ... మహదేవన్ ... సెల్వరాజ్ ... జి. వి. సుబ్బారావు ... సంజీవి ... ఆర్. శ్రీనివాసరావు ... హరిశ్చంద్రరావు" గార్ల సమిష్టి కృషి ఫలితంగా రూపొందుతున్న సుగుణా పిక్చర్స్ వారి చిత్రంలో జగ్గయ్య, కాంచన, విజయలలిత, హలం, జయమాలిని, సారధి, కె. వి. చలం, బాలకృష్ణ, పి. జె. శర్మ ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచించిన పాటలు "ప్రేమనగర్"వలె వేల్యుబుల్ గా వున్నాయి.

పూర్ణా పిక్చర్స్ విడుదలచేసే (అక్కినేని) రెండో చిత్రం యిది.

### రవి చిత్రకు రీ-మేక్

రవి చిత్ర అధినేత వై. వి. రావుగారికి "రీ-మేక్స్" అదృష్టాన్ని ఆర్జించిపెట్టాయి. నిప్పులాంటి మనిషి, (జంజీర్) నేరం నాదికాదు ఆకలిది (రోటీ) చిత్రాలు ధనార్జనకి దారితీశాయి.

ఇప్పుడు వై. వి. రావుకు మరొక "రీ-మేక్" కథ దొరికింది. ఈ కథలో యిద్దరు నాయకు లుంటారు. రెండింటినీ "నటరత్న" పోషిస్తారు.

'ఇంద్ర ధనస్సు'లో గిరిబాబు

"రీ-మేక్స్" మాష్టర్ ఎస్. డి. లాల్ యీ చిత్రానికి దర్శకుడు.





'గోపాలరావుగారి అమ్మాయి'గా సుధ

# సినిమా

*మాణిక్యవీణ కథకు నాయకుడు ?*

వెంబర్ పది, డాక్టర్ నాయర్ వీధికి ఏ రోజు వెళ్లినా, అక్కడ సాహిత్య చర్చ జరుగుతూనే వుంటుంది. వరుసగా అయిదారు కథలను రెడీ చేయించడం, కౌముదీ అధినేతకు అలవాటు. ఆయన సరసన వుంటే, గంటలు నిమిషాల్లాగా దొర్లుతాయి. కారణం ... ఆయన సరస సంభాషణం ... ఆయనిచ్చే ఆతిధ్యము.

ఈ విలేఖరి నిర్మాత ఎమ్. ఎస్. రెడ్డిగారిని ఫిబ్రవరి 11 న కలిసినప్పుడు, ఆయన తన కొత్త కథకోసం వ్రాసిన నాలుగు పాటలను వినిపించారు. అతిశయోక్తి కాదుగాని, "మల్లెమాల" వ్రాసిన ప్రతి పాట మధుర మధురం అనిపించింది.

"మాణిక్యవీణ" కథకు నాయకుడెవరు అని ప్రశ్నించాను. శోభన్‌బాబు అన్నారాయన. టెక్నికల్ యూనిట్‌లో ఎలాంటి మార్పు వుండబోదని (ముత్యాలపల్లకి యూనిట్) ఆయన చెప్పారు.

"మాణిక్యవీణ" వర్ణ చిత్రంలో యిద్దరు "జయలు" నాయికలుగా వుండగలరని, నిర్మాత ఎమ్. ఎస్. రెడ్డి చెప్పారు.

దర్శకుడు బి. వి. ప్రసాద్‌కు శోభన్‌బాబుగారి చిత్రాన్ని చెయ్యాలన్న తలంపు చాలాకాలంగా వుంది. ఆ కోరిక యీడేరే రోజు "మాణిక్యవీణ" ప్రారంభమయ్యే రోజుగా వుంటుందని ఆశించవచ్చు.





# నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారీ భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్, ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు, దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే...



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

హాయినిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువమంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్నా ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు!




## ఒక్క దంతవైద్యులు మాత్రమే దీనికన్న మేలైన దంతరక్షణ సమకూర్చగలరు.

DC.G.62 TL

# సినిమా



'ఆలు–మగలు'లో అక్కినేని, లక్ష్మీకాంత

## పద్మశ్రీ చిత్రం ఎప్పుడు ?

మంచి మంచి చిత్రాలను అందించిన "పద్మశ్రీ" సంస్థ గత రెండేండ్లు మంచి చిత్ర నిర్మాణం జోలికి పోవకపోవడం, ప్రేక్షకులకు అయిష్టంగా వుంది. ఇదే మాటను ఆ సంస్థ యజమాని వెంకటేశ్వర్లుగారిని ప్రశ్నించాను.

"బలమైన కథ దొరకలేదు. రోజూ ఒక కథ వింటూనేవున్నాం. ఎప్పుడు కథ సరయినది లభిస్తుందో, అప్పుడే చిత్ర నిర్మాణం", అన్నారు పద్మశ్రీ అధినేత.

"నటసామ్రాట్"తో చిత్రం నిర్మించే ఉద్దేశ్యం వెంకటేశ్వర్లుగారికి వున్నట్లు, ఆయన మాటల్లో స్ఫురించింది.

"పద్మశ్రీ" సంస్థ ప్రకాశించడానికి పుల్లయ్యగారు కారణకర్త అన్నది జగమెరిగిన నిజం.

పుల్లయ్యగారిచ్చిన "అర్ధాంగి, వెంకటేశ్వర మహాత్యం, సిరిసంపదలు, కొడుకు ... కోడలు" చిత్రాలు ఆ సంస్థ వెరైటీని కోరుతుంది అనెడి నిజాన్ని బహిర్గతం చేస్తున్నాయి.

## జయప్రదకు మరో మంచి పాత్ర

1976లో రెండు హిట్ చిత్రాల నాయికగా పేరు గడించిన జయప్రదకు సింగీతం రూపొందిస్తున్న "అందమే ఆనందం" చిత్రంలో మరొక మంచి అవకాశం లభించింది.

"ఇల్లు...గుడి...మడి" తప్ప మరో ప్రపంచం తెలియని ఆస్తికురాలుగా జయప్రద, ఆమెను గాఢంగా ప్రేమించే భర్తగా రంగనాథ్ నటిస్తున్న "అందమే ఆనందం" వర్ణచిత్రానికి సముద్రాల సంభాషణలను, సత్యం సంగీతాన్ని, శ్రీకాంత్ ఛాయను నిర్వహిస్తున్నారు.

ఈ చిత్రంలో జయలక్ష్మి, నారాయణరావు, రాజశ్రీ, కాంతారావు, సాక్షి రంగారావు సహతారాగణం.

"ఆలుమగలు ఒకర్నొకరు అర్థం చేసుకుని, జీవిత నౌకను నడిపినప్పుడు వారి జీవితాలు ఆనందాన్ని అనుభవిస్తాయి" అనెడి సహజ నిజాన్ని చాటిచెప్పే చిత్రమే "అందమే ఆనందం". ఈ చిత్రాన్ని శ్రీకాంత్ సహతా నిర్మిస్తున్నారు.

"అందమే ఆనందం" షూటింగు విరామ సమయంలో "స్వర్గం... నరకం" జయలక్ష్మిని, ఆమె నటిస్తున్న చిత్రాల గూర్చి అడిగాను.



'స్నేహం'లో దృశ్యం



'అన్నదమ్ముల శపథం'లో జ్యోతి

తెలుగులో బాలయ్యగారి ఈనాటి బంధము ఏనాటిదో, పి. చంద్రశేఖరరెడ్డిగారి ఏరువాక, ప్రసన్నలక్ష్మి పిక్చర్స్‌వారి చిత్రం, ప్రపూర్ణ మూవీస్‌వారి భలే అల్లుడు చిత్రాలలో నటిస్తున్న నిజాన్ని ఆవిడ వెల్లడించింది.

## భలే అల్లుడు

ప్రపూర్ణ మూవీస్ రంగుల్లో నిర్మిస్తున్న కొత్తతరహా చిత్రానికి "భలే అల్లుడు" అని పేరిడినట్లు, నిర్మాతలు వితలేశ్వరరావు, చౌదరిగార్లు చెప్పారు.

"రెబల్‌స్టార్" భలే అల్లుడుగా నటిస్తున్న ప్రపూర్ణ మూవీస్‌వారి చిత్రంలో శారద, పద్మప్రియ, జయలక్ష్మి, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, మోహన్‌బాబు, చంద్రమోహన్, గిరిజారాణి ముఖ్య పాత్రధారులు.

"భలే అల్లుడు" చిత్రాన్ని, దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి బలేగా రూపొందించినట్లు, రషస్ చూచినవాళ్లు అభిప్రాయపడ్డారు.

ఈ చిత్రానికి గొల్లపూడి మాటలు, జె. వి. రాఘవులు సంగీతం, ప్రకాష్ ఛాయాగ్రహణం, బి. ఎన్. కృష్ణ శిల్పం, మహేశ్వరరావు కూర్పు, కె. వి. రావు సహదర్శకత్వం సమంగా సహకరించాయి. అన్నపూర్ణకు యిదొక మంచి చిత్రం.

— శ్రీనివాస్




సూర్యశ్రీ పిక్చర్స్

# జడ్జిగారి కోడలు

స్క్రీన్‌ప్లే. దర్శకత్వం

**వి.మధుసూదనరావు**

నిర్మాత

**కె.ఎస్.రామకృష్ణారావు**

అనపూర్ణ రిలీజ్.

ANNAPURNA

"అమ్మా... అన్నయ్యొచ్చాడే" అంటూ ప్రసాద్ చిన్నతమ్ముడు బాబిగాడు ఇంట్లోకి పరుగెత్తాడు.

చిట్టి "అన్నయ్యొచ్చాడు... అన్నయ్యొచ్చాడు" అంటూ గంతులు వేసింది. ప్రసాద్ అక్కయ్య జానకి ప్రసాద్ చేతిలోని సూట్‌కేసు అందుకుని ఓ ప్రక్కన పెట్టింది.

"ఇంత చిక్కిపోయావేమిటిరా తమ్ముడా" అంది.

ప్రసాద్ ఏదో సమాధానం చెప్పేలోగ నాయనమ్మ లక్ష్మమ్మగారు హడావిడిగా వచ్చి ప్రసాద్‌ని కౌగలించుకున్నారు.

"మా నాయనే... మా నాయనే... వచ్చేశావా ?... అదేమిట్రా అబ్బాయ్... పుల్లలా అయిపోయావ్... కాస్త నల్లబడ్డావ్‌కూడా... హాస్టలులో భోజనం సరిగ్గా పెట్టరా ?" అని అడిగారు.

లక్ష్మమ్మగారికి ప్రసాద్ అంటే వల్లమాలిన ప్రేమ అందుకు కారణం ప్రసాద్‌ది వాళ్ల తాతగారి




పేరు కావడమే. ఇంతలో వంటింట్లోంచి ప్రసాద్ తల్లి సీతమ్మ వచ్చింది. వెనకాలే వార్త చేరేసిన బాబిగాడు కూడా పరుగెత్తుకవచ్చాడు.

"ఏరా ?... ఉత్తరం రాయకుండానే ఊడిపడ్డావే ?... సంక్రాంతి శలవులు యిచ్చేశారా ?... దసరాకి వచ్చినప్పుడే నయం... యిప్పుడు మరీ చిక్కిపోయావేంరా ?... నీ ఆరోగ్యం బావుంటుందా ?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది సీతమ్మ.

వీళ్లందరి ప్రేమానురాగాలకి ప్రసాద్ ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాడు.

"ఏరా... చదువులు ఎలా సాగుతున్నాయి?...' అంటూ అప్పుడే హాల్లోకి వచ్చిన రాఘవయ్య ప్రశ్నించాడు.

"నువ్వుండరా అబ్బాయ్... కుర్రనాగన్న ఇంటికి రాగానే. చదువుల మాటెత్తుతావు... పాపం... ఎప్పుడనగా భోజనం చేశాడో ఏమో ?... వంటయిపోయిందిగానీ నువ్వు త్వరగా స్నానం చెయ్యరాబాబూ... వేడివేడిగా యింత తిందువుగాని" అంటూ లక్ష్మమ్మగారు ప్రసాద్‌ని లాక్కెళ్లారు.

చిట్టి ప్రసాద్ సూట్‌కేసు తణిఖీ చేస్తుంది తనకోసం అన్నయ్యేమైనా తెచ్చాడేమోనని. చిట్టి శ్రమ ఫలించింది.

"అన్నయ్య స్వీట్సూ బొమ్మలూ తెచ్చాడోచ్" అంటూ గంతులు వేసింది చిట్టి.

ఎక్కడినుండో సుడిగాలిలా వచ్చాడు బాబిగాడు. చిట్టి చేతుల్లోంచి స్వీట్స్ పాకెట్ లాక్కుని "స్వీట్సు నాకు... బొమ్మలు నీకు" అన్నాడు. చిట్టి ఏడుపు లంకించుకుంది. దానికి తెలుసు బాబిగాడు స్వీట్సు తిన్నతరువాత బొమ్మలు కూడా లాక్కుంటాడని.

"ఒరేయ్ బాబిగా... చెల్లెలి దగ్గరనుండి అలా లాక్కోవచ్చా ?... తప్పమ్మా... స్వీట్సు యిద్దరూ పంచుకోవాలమ్మా... మా బాబిగాడు మంచివాడు కదూ..." అంటూ జానకి వాడిని మచ్చిక చేసింది.

వాడు చిట్టికి సగం స్వీట్సు యిచ్చాడు. అది ఏడుపుమాని అప్పటికప్పుడే నవ్వేసింది.

భోజనాలయ్యాక అందరూ వరండాలో చేరి కబుర్లలో పడ్డారు. ప్రసాద్ కాలేజీ కబుర్లూ హాస్టలు కబుర్లూ చెప్తుంటే మిగతావాళ్లంతా అతని చుట్టూ చేరి శ్రద్ధగా వింటున్నారు. రాఘవయ్య మాత్రం ఒక మూలగా పుస్తకం చదువుతూ కూర్చున్నాడు. సీతమ్మ ఆయనకు ఎదురుగా కూర్చుని ప్రసాద్ చెప్పే మాటలు వింటుంది.

"మరేమో. అన్నయా . మీ హాస్టలులో ఆడుకోనిస్తారా ?" చిట్టి తన ధర్మసందేహాన్ని వెలిబుచ్చింది.

"నీ ముఖం ! హాస్టలులో ఆడితే టీచర్లు తంతారు... హాస్టలులో చదువుకోవాలి... తెలుసా?" బాబిగాడు అన్నయ్య చెప్పే మాటలకు చిట్టి అడ్డు తగిలినందుకు విసుక్కున్నాడు.

"అబ్బాయ్... మరి హాస్టలులో అంతమంది వుంటారుకదా... ఎక్కడ పెట్టిన వస్తువులు అక్కడే వుంటాయా లేకపోతే మాయమైపోతుం

టాయా ?'' అంటూ లక్ష్మమ్మగారు ప్రశ్నించారు.

జానకి కిసుక్కున నవ్వింది. లక్ష్మమ్మగారు జానకివైపు మిర్రి మిర్రి చూశారు.

''నిజమే నాయనమ్మా... అక్కడ అటువంటి అబ్బాయిలు కూడా వుంటారు. ఒకసారి నేను బల్లమీద పది రూపాయల నోటు పెట్టి ఘర్రిపోయి స్నానానికి వెళ్లాను. తిరిగివచ్చి చూస్తే అది అక్కడ లేదు. ఎవర్ని అడిగినా నాకు తెలియదు అంటే నాకు తెలియదు అన్నారు'' అంటూ ప్రసాద్ హాస్టలులో యింకా ఎవరెవరి వస్తువులు ఎలా పోయాయో చెప్పాడు.

అలా వాళ్లు మాట్లాడుకునే విషయాలు దొంగలమీదకు మళ్లింది. లక్ష్మమ్మగారు దొంగల కథలు చాల చెప్పారు. తరువాత వారి టాపిక్ దయ్యాలలోకి మారింది.

''నాయనమ్మా... అసలు దయ్యాలనేవి నిజంగా వుంటాయా ?'' ఇంతదాకా ప్రశ్నలడిగించుకున్న ప్రసాద్‌కి యిప్పుడు ప్రశ్నలడగడం అతని వంతయింది.

''ఎందుకు లేవూ ? దయ్యాలలోనే చాల రకాలున్నాయి. కొరివి దెయ్యాలు, కామినీ పిశాచాలు, భూతాలు యిలా రకరకాలున్నాయి' అన్నారు లక్ష్మమ్మగారు అందరి ముఖాల్లోకీ చూస్తూ. దయ్యాల గురించి అక్కడ కూర్చుని వున్నవారిలో తనకే తుణ్ణంగా తెలుసునన్న గర్వం ఆమె ముఖంలో కనిపిస్తుంది, చిట్టి, బాబిగాడు గుడ్లప్పగించి ఆవిడ ముఖంలోకి చూస్తున్నారు.

''ఏమో ! దయ్యాలంటే నాకు నమ్మకం లేదు... ఇప్పటివరకు నాకు ఒక్క దయ్యంకూడా కనబడలేదు — మరి నన్ను ఎలా నమ్మమంటావ్ ?'' ప్రసాద్ నిర్లక్ష్యంగా మాట్లాడేడు.

''నీకేం తెలుసురా కుర్రసన్నాసివి... నా చిన్నప్పుడు ఒకసారి దయ్యాన్ని చూశాను...'' అంటూ లక్ష్మమ్మగారు దయ్యాలగురించి వరుసగా కథలు చెప్పసాగారు. అందరూ చీమ చిటుకుమన్నంత శబ్దంకూడా చెయ్యకుండా బొమ్మల్లా కూర్చుని ఆవిడ చెప్పేమాటలు వింటున్నారు. మధ్యమధ్యచిట్టి భయంగా యింటిచుట్టూవుండే చీకటినిచూస్తుంది.

సీతమ్మ అత్తగారు చెప్పే కథలకు విసుక్కుంది. ''చిన్నపిల్లలకు అటువంటి కథలు చెప్తే జడుసుకుంటారన్న జ్ఞానం అయినా లేదు'' అని అనుకుంది.

లక్ష్మమ్మగారు యివేమీ గమనించకుండా తన ధోరణిలో తాను చెప్పుకపోతున్నారు. సీతమ్మ రాఘవయ్య చెవిలో ఏదో ఊదింది.

''ఏవిటమ్మ ఆ దయ్యాల కథలు?... పిల్లలు జడుసుకోరూ అటువంటి కథలు చెప్తే?...'' అంటూ రాఘవయ్య విసుక్కున్నాడు.

లక్ష్మమ్మగారు కథ ఆవుజేశారు పిల్లలు నిరుత్సాహం చెందారు.

''ఇక నిద్రపొండి... ఇప్పటికే చాల రాత్రయింది'' అంటూ రాఘవయ్య యింట్లోకి వెళ్లిపోయాడు. సీతమ్మ అతనిని అనుసరించింది.

''నాన్నమ్మా... నాన్నగారు వెళ్లిపోయారుగా ? మళ్లీ దయ్యం కథ చెప్పు నాన్నమ్మా...'' అంటూ బాబిగాడు మారాం చేశాడు.

''వద్దురా అబ్బీ... మీ నాన్న వింటే తిడతారు... పదండి లోపలికి పోయి పడుకుందాం.''

చిట్టి మత్తు కళ్లతో జోగుతూ లేచింది. జానకి చిట్టిని పడిపోకుండా పట్టుకుంది.

''పదరా అబ్బాయ్'' లక్ష్మమ్మగారు ప్రసాద్ బుజం తట్టారు.

''నేను బాబిగాడు యిక్కడే వరండాలో పడుకుంటాం నాన్నమ్మా...'' అన్నాడు ప్రసాద్.

''అమ్మో... నాకు భయం !... నేను లోపలే పడుకుంటాను...'' అప్పటివరకూ విన్న దయ్యం కథలను గుర్తు చేసుకుంటూ గుండెలమీద చెయ్యి వేసుకున్నాడు బాబిగాడు.

''నువ్వుకూడా లోపలికి పదరా అబ్బాయ్... ఒక్కడివే ఏం పడుకుంటావ్ ?...''

''ఇక్కడే చల్లగా... హాయిగా బావుంటుంది నాన్నమ్మా... నేనిక్కడే పడుకుంటాను...'' అన్నాడు ప్రసాద్.

''సరే... నీ యిష్టం...'' లక్ష్మమ్మగారు బాబిగాడిని తీసుకుని లోపలికి వెళ్లారు. వెనకాలే జానకి చిట్టిని ఎత్తుకుని లోపలికి వెళ్లింది.

ప్రసాద్ వరండాలో నవారు మంచం వేసుకుని పడుకున్నాడు. అప్పటివరకూ లక్ష్మమ్మగారు చెప్పిన దయ్యం కథలు మననం చేసుకుంటూ దయ్యాలు వున్నాయా లేవా అని ఆలోచించసాగాడు. లక్ష్మమ్మగారు చెప్పిన విషయాలు పరిశీలిస్తే దయ్యాలున్నాయన్న నమ్మకం కలుగుతుంది. ఛ...ఛ... దయ్యాలు లేవు... భూతాలు లేవు... అదంతా భ్రమ వుంటే తన కింతవరకూ ఎందుకు కనిపించలేదు ?... అనుకున్నాడు. అలా అనుకున్నాడుగానీ మళ్లీ చుట్టూ వున్న చీకటిని చూస్తే భయం వేసింది. పిచ్చిపిచ్చిగా ఆలోచిస్తూ ఎప్పుడు నిద్రపట్టేసిందో... ప్రసాద్ నిద్రపోయాడు.

హఠాత్తుగా అర్ధరాత్రి ప్రసాద్‌కి మెలుకువ వచ్చింది. ప్రసాద్‌ని ఎవరో వెనుకనుండి కౌగలించుకుని ప్రక్కనే పడుకున్నారు. బాబిగాడే మధ్య రాత్రి వచ్చి తన ప్రక్కన పడుకున్నాడేమో !... తనని కౌగలించుకున్న చేతుల్ని తడిమాడు ప్రసాద్. ఆ చేతులు సున్నితంగా మెత్తగా వున్నాయి. చేతి గాజులు తగిలాయి. ప్రసాద్ వులిక్కిపడ్డాడు. మంచంమీదినుండి లేవబోయాడు. ఆ రెండు చేతులూ ప్రసాద్‌ని లేవనీయకుండా మరీ గట్టిగా బిగించి మీదికి లాక్కున్నాయి. ప్రసాద్ బోర్లా ఆమెమీద పడ్డాడు.

ప్రసాద్ ఉలిక్కిపడ్డాడు.

''ఎవరు నువ్వు... ఏమిటిది ?'' అయోమయంగా ప్రశ్నించాడు.

''నేనండీ... నన్నే మర్చిపోయారా ?'' ఆమె ప్రసాద్‌ని మరింత గట్టిగా తనకు అదుముకుంది.

''ఛీ... వదులు...'' ప్రసాద్ వదిలించుకోడానికి ప్రయత్నించాడు.

''నేను మీ భార్యని... మీ పాదదాసిని... నన్ను యిలా విదిలించుకోడం మీకు న్యాయమేనా ?... రండి... నాలో కలిసిపోండి...''

ఆమె ప్రసాద్ మీదికి ప్రాకింది. ఆమె ముఖం ప్రసాద్ ముఖం మీదికి వంగింది. ప్రసాద్ కళ్ళు బాగా తెరిచి ఆమె ముఖంవైపు చూశాడు. ఆ చీకటిలో ఆమె ముఖం ఆనవాళ్లు తెలియడం లేదు. ఆమె ప్రసాద్ పెదాలతో తన పెదాలు కలిపింది ప్రసాద్ పెదాలు చిట్లి రక్తం కారింది. ప్రసాద్ శరీరానికి ఆమె శరీరం వెచ్చగా రాసుకుంటుంది. ఉన్నట్లుండి అతనికి లక్ష్మమ్మగారు చెప్పిన కామినీపిశాచం కథలు వరుసగా గుర్తుకువచ్చాయి. ప్రసాద్ శరీరంలోని రక్తం గడ్డకట్టింది. ఒళ్లు చల్లబడింది. భయంవల్ల అతనిలోకి ఏదో ఒక అదృశ్యశక్తి ప్రవేశించింది. చటుక్కున ఆమెను విదుల్చుకుని నిలబడ్డాడు. ఆమె అంత దూరంలో ఎగిరిపడింది.

''ఏమండీ... నేను !... మీ భార్యను !!.. నన్ను మర్చిపోయారా ?...'' ఆమె మళ్లీ వచ్చి ప్రసాద్ మీద పడబోయింది.

ప్రసాద్ తప్పుకున్నాడు.

''ఛీ... వెళ్లిపో యిక్కడినుండి...'' అన్నాడు.

ప్రసాద్ వైపు రాబోయిన ఆమె చటుక్కున ఆగిపోయింది. కొన్ని క్షణాలు ఆమె తీవ్రంగా ప్రసాద్ వైపు చూస్తూ నిలబడింది. ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాల శబ్దం ఆ నిశ్శబ్ద నిశీధిలో భయంకరంగా అతని చెవులకు సోకుతుంది. ప్రసాద్ కాళ్లు వణుకుతున్నాయి. ఇది తప్పకుండా ఏ కామినీ పిశాచమో అయ్యుంటుంది అనుకున్నాడు.

ఆమె వున్నట్లుండి క్రిందికి వంగి మంచం ప్రక్కనుండి ఒక పెద్ద బెత్తం తీసింది. ప్రసాద్ పై ప్రాణాలు పైనే పోయాయి. ఆమె పులిలా ముందుకు దూకింది. ప్రసాద్ ఏమి జరుగుతుందో ఊహించేలోగా ఆమెమీద పడి బెత్తంతో బాదడం మొదలుబెట్టింది.

ప్రసాద్ గావుకేక పెట్టి వెనక్కు విరుచుకుపడ్డాడు. అతని కేక చీకటిని చీల్చుకుంటూ భయంకరంగా ప్రతిధ్వనించింది. ఆమె బెత్తాన్ని గాలిలో ఊపుకుంటూ రయ్యిమనిచీకటిలోకిదూసుకుపోయింది.

ప్రసాద్ గావుకేక విని యింటోంచి అందరూ బయటికి పరుగెత్తుకు వచ్చారు. నేలమీద పడిఉన్న ప్రసాద్‌ని చూసి రాఘవయ్య కంగారు పడిపోయాడు. సీతమ్మా, లక్ష్మమ్మగారూ గుండెలు బాదుకుని రోదించారు. జానకి పిచ్చిదానిలా చూస్తూ కూర్చుంది. పిల్లలిద్దరూ ఏడుపు లంకించుకున్నారు.

ప్రసాద్ ముఖంమీద నీళ్లు జల్లాడు రాఘవరావు ప్రసాద్ నెమ్మదిగా కళ్లు తెరిచాడు. లక్ష్మమ్మగారు నెమ్మదిగా ప్రసాద్‌చేత మంచినీళ్లు త్రాగించారు. ప్రసాద్ కొంతసేపు లక్ష్మమ్మగారి ఒడిలో తల పెట్టుకుని అలానే కదలకుండా పడుకున్నాడు. భయంవల్ల అతనిగుండె ఇంకా ఎగిరెగిరి పడుతూంది.

కొంతసేపయిన తరువాత ప్రసాద్ జరిగిన కథంతా చెప్పాడు. రాఘవరావుకు ఏమీ అర్థంకాలేదు. లక్ష్మమ్మగారు మాత్రం అది తప్పకుండా కామినీ పిశాచమే అని తీర్మానించారు. ఆమె తీర్మానాన్ని అవుననాలో కాదనాలో మిగతావారికి తోచలేదు.

ప్రసాద్ భయంవల్ల ఒక నాలుగు రోజులపాటు జ్వరం పడ్డాడు. ఆరోజు నుండీ ప్రసాద్ వరండాలో పడుకోవడం మానేశాడు.

ఆరోజు—

ఉదయం భోజనాలయిన తరువాత రాఘవయ్య ఎక్కడికో బయటికి వెళ్లిపోయాడు. సీతమ్మ,

లక్ష్మమ్మగారూ జానకి వరండాలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. బాలిగాడు, చిట్టి ఒక మూల అక్కపిడతలు పెట్టుకుని ఆడుకుంటున్నారు. ప్రసాద్ లోపలిగదిలో కూర్చుని నవలేదో చదువుకుంటున్నాడు.

కొంతసేపయిన తరువాత ఒకమ్మాయి రాఘవరావు ఇంటికివచ్చి వరండాలో ఉన్న సీతమ్మను, లక్ష్మమ్మగారిని పలకరించింది. ఆమె వయసు ఇరవై ఆరు ఉండవచ్చునేమో!...ఓమాదిరి రూపంఉంది.

"ఏం కావాలమ్మాయ్ ?" అంటూ లక్ష్మమ్మగారు ప్రశ్నించారు.

"మాది ఈ ప్రక్కఊరేనండీ ... మానాన్నగారికి మేము ఆరుమంది ఆడపిల్లలం... మాకు ఒక అన్నయ్యకూడా ఉన్నాడు" అంటూ ఆ అమ్మాయి ఏమేమో చెప్తుంది.

గదిలోపల ఉన్న ప్రసాద్‌కి ఈ మాటలన్నీ వినిపిస్తున్నాయి. తన కష్టాలు చెప్పుకుని తృణమో పణమో సహాయం చెయ్యమని అడుగుతుంది కాబోలు అనుకున్నాడు.

"నా అక్కల అయిదుగురికీ పెళ్లిళ్ళు అయిపోయాయి. నాక్కూడా పెళ్ళయిపోయిందిలెండి... మీరు నాకు పెళ్లి కాలేదని అనుకుంటున్నారు కదూ ... నాకు తెలుసు ... నాకు పోయిన సంవత్సరమే పెళ్ళయింది. నా అక్కయ్యలకంటే మంచి సంబంధం దొరికింది. ఆయన ఆరడుగుల పొడుగు ఉంటారు. చాల అందంగా ఉంటారు..."

ఆమె తన భర్తను గురించి ఏమేమో పొగుడుతూ చెప్పుకుపోతుంది. లక్ష్మమ్మగారు ఆమె వచ్చిన పనేమిటని రెండుమూడుసార్లు అడిగారు. ఆమె అదేమీ పట్టించుకోకుండా తన సొదంతా చెప్పుకుపోతుంది.

ఉన్నట్లుండి ఆమె కెవ్వున కేకేసింది. ఏమైందోనని ప్రసాద్ లోపలినుండి వరండాలోకి కంగారుగా వచ్చాడు. అప్పుడే రాఘవరావు ఇంటివైపు ఇద్దరు వ్యక్తులు పరుగులు పెడుతూ వస్తున్నారు. ఆమె వాళ్లను చూసే కేకలు పెట్టింది.

"రాకండి... మీరు నా దగ్గరకు రాకండి... ఏమండీ... మీరు వాళ్లని పొమ్మనరూ ?... వాళ్ళు రాక్షసులు!... నన్ను ఇంటికి తీసుకెళ్లి గదిలో పెట్టి తాళం పెట్టేస్తారు. వాళ్లను పొమ్మనండీ..." ఆమె లక్ష్మమ్మగారిని ప్రాధేయపడింది.

వాళ్లెవరికీ ఇదేమీ అర్థం కావడంలేదు.

"లక్ష్మీ ... ఏమిటమ్మా ఇది ? ... తప్పు కదూ ?... రా యింటికి పోదాం..." అన్నారు వచ్చిన ఇద్దరు వ్యక్తులలో ఒకతను.

"నేను రాను పో... మీరెందుకు వచ్చారు ?... పొండి..." లక్ష్మి అనబడే ఆమె అతనివైపు ఎర్రగ చూస్తూ అంది.

"అలా మారాం చెయ్యకండి అమ్మాయిగారూ... మీరు మంచివారు కదూ ?... ఇంటికి రండమ్మాయిగారూ" రెండవ వ్యక్తి అన్నాడు.

"పెళ్లయిన ఆడవాళ్లు అత్తింట్లో వుండాలిగానీ పుట్టింట్లో ఉంటారేమిటి ? ... నేను మీ యింటికి రాను... మా ఆయన ఎక్కడుంటే అదే నా యిల్లు" అంది లక్ష్మి.

# అపస్వరమ్

ఇంతలో ప్రసాద్ ఆమె దృష్టిలో పడ్డాడు.

"ఆ ... అదిగో మా ఆయన... ఏమండీ ... వీళ్ళు నన్ను తీసుకెళ్లడానికి వస్తే చూస్తూ ఊరుకున్నారేం ? ... నన్ను పంపవని చెప్పండి !" అంటూ ప్రసాద్ దగ్గరికి పరిగెత్తుక వచ్చింది. ఇప్పటికి లక్ష్మమ్మగారు, సీతమ్మలకు పరిస్థితి కొంత అవగాహన అయింది.

మొదటి వ్యక్తి రివ్వున ముందుకువచ్చి లక్ష్మిని ప్రసాద్‌మీద పడకుండా రెక్క పట్టుకుని ప్రక్కకు లాగేశాడు.

"వదులు ... నన్నొదులు" అంటూ లక్ష్మి గింజుకోసాగింది. అతను లక్ష్మిని బుజ్జగించుతూ నచ్చజెప్పుతున్నాడు. లక్ష్మి ప్రసాద్ వైపు చూస్తూ 'ఏవండీ ... చూడండి యీ రాక్షసుడు నన్ను ఇంటికి రమ్మని పీక్కుతింటున్నాడు ... మీరొచ్చి వీడికి రెండు తగలనివ్వండీ..." అంటున్నది. అతను లక్ష్మిని రెక్కపట్టుకుని బలవంతంగా కాస్త దూరం లాక్కెళ్ళి గడ్డం పట్టుకుని బ్రతిమలాడుతూ ఏమో అంటున్నాడు. ఆమె తల అడ్డంగా ఊపుతూ ఏమో అంటున్నది. కళ్ళముందు జరుగుతున్నదంతా నోరు తెరుచుకొని చూస్తున్నారు జానకి, సీతమ్మా, లక్ష్మమ్మగారు ప్రసాద్ రెండవ వ్యక్తిని అసలు సంగతేమిటనిఅడిగాడు.అతను చెప్పడంమొదలుపెట్టాడు.

వాళ్లది ఆ ప్రక్క వూరు. అతను లక్ష్మి వాళ్ళింట్లో పాలేరు. ఆ మొదటి వ్యక్తి లక్ష్మికి అన్నయ్య అవుతాడు. లక్ష్మికి యింకా అయిదుగురు అక్కయ్యలున్నారు. లక్ష్మి తండ్రి పోలయ్య మొదటి ఆరుగురు అమ్మాయిలకు పెళ్లి చేసేసరికి అతని ఆస్తంతా కరిగిపోయింది. అసలే వాళ్ళ కులంలో కట్నాలు ఎక్కువ అవడంచేత తనకున్న పొలాలు, వాళ్ళ కట్నాలు పెళ్లి ఖర్చులక్రింద అమ్మేశాడు. లక్ష్మి పెళ్ళీడుకు ఎదిగేసరికి అతని ఆస్తంతా హరించుకుపోయింది. లక్ష్మికి ఎన్నో సంబంధాలు వచ్చాయి. కాని కట్నాలవద్ద కుదరక అన్నీ తప్పిపోయాయి. లక్ష్మి దురదృష్టమో ఏమో ఒకసారి పెళ్లి చూపులకని వస్తున్న ఒకబ్బాయిని లారీ గుద్దేసింది. ఆ అబ్బాయి అక్కడికక్కడే మరణించాడు. ఈ సంఘటనవల్ల లక్ష్మికి సంబంధాలే రావడం తగ్గిపోయాయి. పోలయ్య లక్ష్మికి పెళ్లి కాదేమోనని బెంగపడిపోయాడు.

లక్ష్మికి పదహారేళ్ళనుండే పెళ్లి చేసుకోవాలన్న కోర్కె చాల బలంగా వుంది. ఆమె యెప్పుడూ తనకు కాబోయే భర్తను గురించి ఊహిస్తూ తీయని కలలుకనేది. రోజు రోజుకీ ఆమెలోని కోర్కె తీవ్రం కాసాగింది.

ఆమెకు ఇరవై ఏళ్ళు దాటినా పెళ్లి కాలేదు. లక్ష్మికి రానురాను తండ్రిమీద, అన్నయ్యమీద ద్వేషం పెరిగిపోయింది. వాళ్ళు నిద్రపోతున్నప్పుడు మెల్లగా లేచి గొడ్డలితో నరికేయాలని అనుకునేది. ఆమెలోని కోర్కెలు తీవ్రమయినకొద్దీ ఆమె మరీ పిచ్చిదై పోసాగింది. ఒక్కొక్కప్పుడు తనవైపు అదేపనిగా చూసే ప్రక్కింటి రాముతో లేచిపోదాం అనుకునేదిగానీ సంఘం, సాంప్రదాయం అన్నీ గుర్తుకు వచ్చి తనను నిత్యం దహించివేసే కోర్కెలను బలవంతంగా అణచుకునేది.

మరో మూడు ఏళ్లు గడిచిపోయాయి. లక్ష్మికి అప్పుడు ఇరవై అయిదేళ్లు. పోలయ్య ఆమె పెళ్లి గురించి పట్టించుకోవడం మానేశాడు. తొమ్మిదేళ్ల నుండీ అణచుకున్న కోర్కెలు విజృంభించి ఆమె మనసును మథించివేశాయి. ఆమె మనసంతా అల్లకల్లోలం అయిపోయేది.

తను అవివాహిత!...తనకు భర్త లేడు!!...తన అక్కయ్యలకు భర్త ఉన్నారు...తనకు భర్త లేడు...

ఆమె హృదయం ఆక్రోశించింది.

ఇన్నాళ్ళుగా అణచిపెట్టుకున్న కోర్కెలు విజృంభించాయి. ఎక్కడికైనా రాముతో లేచిపొమ్మంది అంతరాత్మ. మనసు ఒప్పుకోలేదు.

బలమైన కోర్కెలకూ భయపడే మనసుకూ మధ్య పెద్ద పోరాటం సాగింది. ఫలితం లక్ష్మి పిచ్చిదైపోయింది. అప్పటినుండీ లక్ష్మి కనబడిన ప్రతి ఒక్కరికీ తనకు పెళ్లయిందనీ ఫలానా ఊర్లో తన భర్త వున్నాడనీ, చాల అందంగా వుంటాడనీ మంచివాడనీ ఏమేమో చెప్తుంటుంది. కాస్త అందంగావున్న అబ్బాయి కనబడితే అతనిమీద పడి మవ్వే "నా భర్త" అంటుంది. అందుచేత పోలయ్య లక్ష్మి ఇల్లు కదలకుండా కట్టుదిట్టాలు చేసేవాడు. ఆమెను గదిలో పెట్టి తాళం వేసేవాడు. అప్పుడప్పుడూ లక్ష్మి ఇంట్లోంచి పారిపోతుంటుంది. పోలయ్య, పాలేరులు, లక్ష్మి అన్నయ్యా నలుగురూ నాలుగువైపులా వెదికి లక్ష్మిని పట్టుకునేవారు. ఇలా ఒక సంవత్సరం నుండి జరుగుతుంది.

కథ చెప్పడం ఆపి నిట్టూర్చాడు పాలేరు. అతను చెప్పిన విషయాలు విన్న తరువాత అక్కడున్న వారందరి హృదయాలు బరువెక్కాయి. లక్ష్మమ్మగారు చెంగుతో కళ్లు వొత్తుకున్నారు.

"రంగయ్యా ... మనం పోదాం పద" అని పిలిచాడు లక్ష్మి అన్నయ్య. అతను యెట్లాగో తంటాలుపడి లక్ష్మికి నచ్చజెప్పినట్టున్నాడు. ఆమె బుద్ధిగా అతనిప్రక్క నిలబడి వుంది. రంగయ్య, లక్ష్మి అన్నయ్యా వాళ్లందరివద్ద శలవుతీసుకుని లక్ష్మిని తీసుకొని వెళ్లిపోయారు.

ప్రసాద్‌కి హఠాత్తుగా తను ఊరినుండి వచ్చిన మొదటిరోజు రాత్రి జరిగిన సంఘటన గుర్తుకు వచ్చింది. అవును ! ... ఆరోజు రాత్రి వచ్చింది యీ అమ్మాయే ... సందేహంలేదు...అనుకున్నాడు.

"నాన్నమ్మోయ్..." ఉన్నట్లుండి అరిచాడు ప్రసాద్.

లక్ష్మమ్మగారు ఏమిటన్నట్లు చూశారు.

"దయ్యాలు, కామినీ పిశాచాలు లేవు నాన్నమ్మా ... నాకు నమ్మకంలేదు ... అదంతా భ్రమ.. ఇకనుండి నేను ఛస్తే నమ్మను" అన్నాడు.

లక్ష్మమ్మగారికి ఇప్పుడు ప్రసాద్ ఆ విషయం గురించి ఎందుకు మాట్లాడుతున్నాడోఅర్థంకాలేదు.

జానకి వరండాలో స్తంభానికి ఆనుకుని ఎటో శూన్యంలోకి చూస్తుంది.

"ఏమిటో కొందరి జీవితాలు బాణీ ఎక్కగా కుదిరిన గీతంలా మధురంగా వుంటాయి ... మరి కొందరి జీవితాలు అన్నీ అపస్వరాలతో కూర్చిన గీతంలా దుర్భరంగా వుంటాయి" అనుకుంది ఇంకా పెళ్లికాని ఇరవై అయిదేళ్ల జానకి.

# బ్రూ: ప్రత్యేక రుచి, సరియైన చిక్కదనం




మంచి కాఫీ అభిమాను
లందరికీ:

బ్రూ ప్రత్యేక రుచి దేశమంతటా కాఫీ
అభిమానుల మెప్పును పొందింది అందువలన
ఇన్‌స్టెంట్ కాఫీలో మేటిగా ఉన్నది.
బ్రూ రుచి మీద అభిమానం రోజురోజుకూ
పెరుగుతోంది. మంచి చిక్కని కాఫీ బ్రూ
ఎప్పుడూ అసమాన తృప్తినిస్తుంది
మెచ్చిన రుచి, చిక్కదనం ఈ
రోజే వాడి చూడండి.

## దక్షిణాదిన మేటి అయిన బ్రూ అతిత్వరగా భారతదేశపు అభిమాన ఇన్‌స్టెంట్ అవుతుంది

OBM-4756A/2 TEL

## పోట్లాట తరగతులు !

ఆస్ట్రేలియా కాలేజీలో మిగతా పాఠాలతోపాటు రోజూ విద్యార్థులు ఒకరితో నొకరు గనుక పోట్లాడుకుంటే ఏ విధంగా తిట్టుకోవాలి, ఆ సమయంలో ఏలాటి మాటలు వాడాలి అనే విషయంమీద కూడా క్లాసుల్లో చెప్తున్నారట.

## టెలిఫోనుకి కొత్త సాధనం !

స్వీడనులో ఫోనుకు ఓ కొత్తరకం సాధనం కనిపెట్టి పెట్టారట. దీనివల్లమనం ఫోను చేసిన నెంబరు ఆ సమయంలో ఎవరితోనో మాట్లాడుతూ వుంటే మనం ఒక బటను లాంటిది నొక్కి రిసీవరు పెట్టేస్తే— అవతల ఆ ఫోను మాటలయిపోయాక మనకి కనెక్షను ఇస్తుందట. అంటే ఫోను ఎంగేజ్డ్‌గా వున్నప్పుడు కాల్ పెండింగు— అనక కనెక్షను ఆటో మాటిగ్గా వచ్చి, మనఫోను మోగుతుందన్నమాట. మనిషి మేధస్సు మేధస్సు కందనంతగా ఎదుగుతూంది ! అహో !!!

## రద్దీలో వెళ్తే 6 రూ.లు పన్ను !

సింగపూరులో రద్దీ బజారులలో కారుల్లో వెళ్ళడానికి వీల్లేదు. దీనికోసం కారులు రద్దీని తగ్గించడానికి ఆ బజారులలో కొన్ని రద్దీవేళల

## యువతరం

ఈ మధ్యనే ఇంటర్ పరీక్షలు వ్రాసిన వి. రామకృష్ణకు సినీ జర్నలిజం కూడా కష్టంగా నేర్చుకోవాలనుంది. కొంతకాలం



వాళ్ళ వూరు సినిమా పట్నానికి ఒక సినీ పత్రిక ఏజంటుగాను విలేఖరిగాను పనిచేశా ననిచెప్పాడు. అప్పుడు కొందరు సినీ నటులని ఇంటర్వ్యూ కూడా చేశాడు. సినిమా రచన అన్నా దర్శకత్వమన్నా ఎంతో ఇష్టం. "కలం స్నేహం చేయుటం, కథలు, గేయాలు వ్రాయుటం నా హాబీలు. "శ్రీ ప్రియ" అనే కలం పేరుతో నా రచనలు కొన్ని అచ్చయినాయి" అని చెప్పాడు. ప్రస్తుతం టైప్‌రైటింగ్, షార్ట్ హాండులను కూడా నేర్చుకుంటున్నాడట — పుస్తక విక్రేతగాకూడా అనుభవం వుంది. స్వయం ఉపాధికి కృషిచేస్తూ విద్యను నేర్చుకుని — గ్రాడ్యుయేట్ కావాలని ఉవ్విళ్ళూరుతున్నాడు. [వి. యస్]

## ఫిల్మ్ సిటీ డైరీ

నిర్ణయించి, ఆ సమయంలో పెళ్ళాలంటే కారుకు లక్ష రూపాయలు పన్ను చెల్లించాలని రూలు పెట్టారట.

### రహస్యంగా తుపాకుల తయారీ

సేలంకు చెందిన శంకగిరి అనే ఊరులో 41 ఏళ్ళ పొన్నుసామి ఆచారి అనే ఆయన అతి చాకచక్యంతో తుపాకులు రహస్యంగా తయారుచేసి, అంతకు మించిన రహస్యంగా అమ్ముతున్నాడట. అంత జాగ్రత్త పడ్డా చివరికి పోలీసుల కళ్ళ పడకుండా తప్పలేదు. తత్ఫలితంగా జైల్లో పడ్డాడట.

### రెండంతస్తుల రైలుపెట్టె

మద్రాసు సెంట్రలు స్టేషనునుంచి బొంబాయి వెళ్ళే కొత్త ఎక్స్‌ప్రెస్‌లో రెండు అంతస్తులున్నాయట. క్రిందతస్తు, పై అంతస్తు కలిసి అసలు రైలుపెట్టెకన్నా ఇంకో అడుగు ఎత్తు ఎక్కువట.

### రెండు కుక్కల కోసం జట్ విమానం !

లండనులో ఓ పత్రిక అధిపతి కీ. శే. లార్డ్ బీవర్‌బ్రూక్ భార్య తన రెండు పెంపుడు కుక్కలను లండనునుంచి అమెరికాకు ఓ జట్‌విమానం అద్దెకు తీసుకుని అందులో తీసుకువెళ్ళిందట. ఆ విమానంలో 227 మంది ప్రయాణీకులు హాయిగా ప్రయాణం చేయవచ్చు. అందుకనే కలవారి కుక్కలుగా పుట్టడం పూర్వజన్మ సుకృతం పొమ్మన్నాడొకాయన !

### కొత్తరకం సిగరెట్లు !

సిగరెట్లు వెలిగించే సిగరెట్లుతీసి, దాని కొస ఒకటి ఆ పెట్టెమీద ఓ నిర్ణీతమైన చోట రాస్తే ఆ సిగరెట్లు వెలిగే పద్ధతిలో ఓ సిగరెట్లు కంపెనీ సిగరెట్లు తయారు చేస్తోందట.

### మనిషి చర్మంలో తేడాలు

యూరోపు, అమెరికా వారి చర్మంలో రెండు మూడు రకాలైన మార్పులే వున్నాయట. అదే మనిషి చర్మానికి, చర్మానికి కల తేడాలు, అదే భారతీయుల్ని పరిశీలిస్తే 150 రకాల తేడాలు కనుపించాయట. వాట్! బాగా అర్థం కాలేదా ! వాళ్ళొప్పించిందంతవరకే మరి !

### డబ్బివ్వలేదని తండ్రిని చంపిన తనయుడు

సేలంకు చెందిన కొడుముడిలో 68 ఏళ్ళ తొంగప్ప గవుండర్ అనే ఆయన కొడుకు 24 ఏళ్ళ రావత్ కుమార్ పొద్దున్న లేచింది మొదలు చీకటిపడి నిద్రపోయేవరకూ డబ్బులివ్వ్ డబ్బివ్వ్ అంటూ తండ్రిని కుమ్మరి పురుగులా దొలిచి ప్రాణాలు తోడేసేవాడట. శక్తి వున్నంతవరకూ ఇచ్చి ఇక ప్రాణం విసిగి ఇవ్వను పోరా.... "కొడుక్కా ముండయ్యావుపోరా" అన్నాడట. దాంతో రావత్కుమారు కాత్తంవచ్చి సత్రున కత్తి తెచ్చి తండ్రిని పొడిచిచంపేశాడట. దురాత్ముడు

### రెండు పుస్తకాలకు 88 లక్షలు ఆర్జించిన రచయిత్రి

స్టాలిన్ కూతురు స్వెత్లానా రెండేరెండు పుస్తకాలను రచించి 88 లక్షల రూపాయలు (మన లెక్కలో) సంపాదించుకున్నదట. ●

# వంటలు

## ఒరియా పిండివంట
## "లడికేని"

కొలతలు : శెనగపప్పు – 1 గ్లాసు, మైదా – 1 కప్పు, చక్కెర – 2 గ్లాసులు, పాలకోవా – 1 కప్పు, ఏలకులు – 5, కుంకుమ పువ్వు, డాల్డా – తగినంత.

చేయవలసిన విధానము : పంచదార వేయకుండా ఒక కప్పు పాలకోవాను ముందుగా చేసి పెట్టుకోవాలి. శెనగపప్పును ఒక గంట నీళ్ళల్లో నానబెట్టి, తర్వాత మెత్తగా రుబ్బి, ఒక పళ్ళెంలోకి తీసుకుని దానిలో మైదా, కోవా అర గ్లాసు పంచదార, యాలకులు, కుంకుమపువ్వు వేసి రుబ్బాలి.

ఈ రుబ్బిన దానిని సునరు కావలసిన ఆకారాల్లో బిళ్ళలుగా చేసుకుని డాల్డాలో వేయించాలి. మిగిలిన ఒకటిన్నర గ్లాసుల చక్కెరలో కాసిని నీళ్ళువేసి తీగపాకం పట్టాలి. ఆ పాకంలో వేయించి పెట్టుకున్న బిళ్ళలు వేసి కొన్ని నిముషాలు వుంచి, నిడిగా తీసివేయాలి. ఈ మాదిరిగా అన్నీ చేయాలి. గుల్లగా పాకం పీల్చుకుని రుచిగా ఉంటాయి. పండుగ రోజుల్లో "ఒరిస్సా" రాష్ట్రం వాళ్ళు ఎక్కువగా యీ వంటకన్ని చేసుకుంటారు.

— పల్లిశ్రీ నాగరాజ్







## భారతదేశంలో ఉపగ్రహ కేంద్రం

తమిళనాడులోని కవలూర్‌లో ఉపగ్రహ ప్రయోగ కేంద్రం నిర్మాణం పూర్తి అయి పని ప్రారంభించింది. సోవియట్ యూనియన్, జెకొస్లోవేకియా, హంగేరీ, పోలెండ్, తూర్పు జర్మనీలు తయారు చేసిన పరికరాలతోనూ, సాధనాలతోనూ యీ కేంద్రం రూపొందింది. సోవియట్ సహకారంతో భారత ప్రభుత్వం కొనసాగిస్తున్న అంతరిక్ష పరిశోధనా కార్యక్రమ సాధనలో యీ కేంద్ర నిర్మాణం ఒక నూతన చర్య.

# మోహనాస్త్రం

రంగధాటు



రైలింజను కూత కూసింది. సీటులో చేరగిలబడ్డ విశ్వనాథం, ఆలోచించ సాగాడు. ఉన్నకొద్దిసావాసా, సర్దుకోవడం అయిపోయి, ముందుగా 'రిజర్వు' చేయబడ్డ సీటుతో కూచున్న విశ్వనాథానికి వేరేపని లేక పోయింది.

ఎన్నెన్నో మజిలీలు చేసి, విశాఖపట్నం వచ్చింది ఈ 'మెయిలు' బండి! మరింకెన్నెన్నో మజిలీలు చేసి 'కలకత్తా' అనేగమ్యం చేరు కుంటుంది! తనూ జీవితంలో ఎన్నోమజిలీలు చేసి, ఈనలభై అయిదేళ్ళవయసు గడిపాడు.

ఇంకా ఎన్నిమజిలీలో...ఎన్నెన్నో?

అతనిదృష్టి, ఎదుటిబెంచీమీద కూర్చున్న అందమైన యువతి మీదపడింది. ఆమెకు ముప్పై ఏళ్ళుండచ్చు. ఆమే అతనిని తదేక దృష్టితో చూస్తోంది.

'ఇదేమిటిది? అలాచూస్తోంది.' అనుకుని గబుక్కున దృష్టి మరల్చుకుని, పైనున్న సీలింగ్‌ఫానుకి ఎన్నిరెక్కలో లెక్కపెట్టాలని చూశాడు. కుదరలేదు! ఊహూ! అంతకన్నా, తనకళ్ళు, ఎదురుగా కూర్చున్న ఆ అందమైన యువతి కాలివేళ్ళు ఎన్నోచెప్తానంటున్నాయి.

తరువాత ఆమెకట్టుకున్నచీర అంచు ఏరంగో, చీరది ఏరంగో పోల్చాయి. మెల్లిగా ఆమెనడుము కొలతని కూడా పరిశీలించాయి.

ఇంకా పైకెళ్తూ, మళ్ళీ ఒసారి చుట్టూ ఉన్నజనాన్ని పరికించాయి. అలాచూస్తూ, గిరుక్కున ఆమె చూపుతో చూపుకలిపాయి.

ఆమె కూడా...తలఅటు వైపుకు తిప్పు కుంది. రైలు కదిలింది.

మనసులో ఏదోమెదిలింది. ఎప్పుడో,ఏదో మజిలీలో చూసిన మొహం జ్ఞాపకమొచ్చింది.

ఈమె మొహం కూడా అలాగేవుంది,

కానీ,...! ఆమొహం ఒకవేశ్యది! తనువిచిత్ర మైన పరిస్థితులలో ఆమెను కలుసుకున్నాడు. ఈమె చాలా 'హైక్లాసు' సంసారిలావుంది. కాలివేళ్ళకు మట్టెలూ, మెడలో నల్లపూసల గొలుసూ, గుండెలమీద నుంచి భుజంమీదకి వెళ్ళి చుట్టూ ప్రదక్షిణం చేసివచ్చిన పమిటా, స్పష్టంగా కనిపిస్తున్నాయి.

కానీ...కళ్ళు! అవిమాత్రం తను మునుపు చూసినవే. మొహంలో చిరునవ్వు కూడా ...

రైలు వేగం పుంజుకుని ముందుకు పరిగెత్తుతోంది. విశ్వనాథం మనస్సు గతం లోకి పరిగెత్తుతోంది.

పదేళ్ళ క్రిందటి సంఘటన, గుర్తు కొచ్చింది. తను అప్పుడు వైజాగ్ ఆఫీసులో చీఫ్‌ఎకౌంటెంటు. సుమారు పది బ్రాంచీల 'ఆడిట్'లు చూస్తూండేవాడు.

ఒక పెద్ద వ్యాపార సంస్థ అయిన 'బర్న్ అండ్ కో'లో విశ్వనాథం ఒక పెద్ద ఆఫీసరు. ఆ సంస్థకు అనేక మిల్లులూ, అనేక ఏజన్సీలూ వున్నాయి.

మధ్యాహ్నం రెండుగంటలకు మేనేజరు వద్దనుంచి అతనికి పిలుపు వచ్చింది. వెంటనే వెళ్ళాడు.

ఎయిర్ కండిషన్డ్ ఆఫీసులో విశాలమైన టేబిలుముందు కూర్చుని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్న మేనేజరు, విశ్వనాథాన్ని చూసి, ఎదురుగావున్న కుర్చీలో కూచోమని సౌజ్ఞ చేశాడు.

"నువ్వు వెంటనే వెళ్ళి మన రాజమండ్రీ బ్రాంచి 'ఆడిట్' చెయ్యాలి". అన్నాడు మేనేజరు.

'అలాగే; హెడ్డాఫీసు అడిగినస్టేటుమెంటు రేపటికి...' అతనిమాట పూర్తికాలేదు.

"హెడ్డాఫీసునుంచి ఫోనువచ్చింది. కారు బయట సిద్ధంగా వుంది. మీయింటికి నేను కబురు పెడతాను. నువ్వికబయల్దేరవచ్చు.," అన్నాడు. మేనేజరు.

విశ్వనాథం ఒకనిముషం ఆలోచించి,'సరే' నన్నాడు. మళ్ళీ తనసీటులోకైనా వెళ్ళ కుండా, బయల్దేరాడు.

మర్నాడు ప్రొద్దున్న ఎనిమిదిగంటలకు, రాజమండ్రీ బర్న్‌కంపెనీ బ్రాంచి తలుపులు

తాళం తీసేసమయానికి అక్కడవిశ్వనాథం తయారు.

తొమ్మిదిన్నరకు, హుషారుగా, ఈలవేసు కుంటూ, చేతిలోగోల్డ్‌ఫ్లేక్ టిన్నుతో, ఆఫీసులోకి ప్రవేశించిన చంద్రం. తనసీటుకి



పక్కగా కూర్చుని, పుస్తకాయిటీ చేస్తున్న విశ్వనాథం కనిపించేసరికి షాక్ తిన్నట్లు ఫీలయ్యాడు.

చంద్రం పూర్తిపేరు చంద్రశేఖరం. అతని వయస్సు పాతికేళ్ళు. నాలుగేళ్ల క్రితం బర్న్ అండ్ కో లో గుమాస్తాగా చేరాడు. రెండేళ్ళ క్రితం రాజమండ్రి బ్రాంచికి 'ఇన్‌చార్జి'గా వేశారు. అది చాలా చిన్న బ్రాంచి. పైగా

చంద్రశేఖరం వైజాగ్ ఆఫీసులో అసిస్టెంటు మానేజరుకి బావమరిది.

యువకుడు చురకైన వాడనీ, కష్టపడి పని చేస్తాడనీ అతన్ని రాజమండ్రి వేసారు అతను వచ్చిన మొదటి సంవత్సరంలోనే ఆ బ్రాంచి మంచి లాభం చూపించింది.

ఇది రెండో సంవత్సరాంతం.

అతన్ని చూసి విశ్వనాధం ఆశ్చర్య పోయాడు. మునపటి చంద్రంలా రెండు మునుపు సన్నగా, పొడుగ్గా, ఎర్రగా వుండి, కొంచెం పొట్టిగావున్న కాటన్ ఫాంటూ, మాసిన గళ్ళ కాటన్ షర్టూ వేసి, ఎప్పుడూ ఏదోపనిచేస్తూ సీరియస్‌గా వుండేవాడు.

ఇప్పుడు, టెరిలిన్‌షర్టూ, టెరికాటన్ ఫాంటూ, సికోరిస్టువాచీ, మెళ్ళో సన్నని బంగారపు గొలుసూ, పాతరాగి విగ్రహాన్ని చింతపండుతో తోమితే వచ్చే మెరుపులో, మెరుస్తున్నాడు

చేతిలోని గోల్డ్‌ఫ్లేకు టిన్ను, మనవాడి 'స్టేటస్' ఎలాంటిదో నన్ను చూసి,పోల్చుకో మంటోంది.

'హల్లో విశ్వనాధంగారూ! ఎప్పుడొచ్చారు?'

"ప్రొద్దున్నే ఇక్కడికొచ్చాను"

"అలాగ! సారీసార్! రాత్రి ఒక ఫ్రెండింట్లో పార్టీ జరిగింది. పడుకునేటప్పటికి చాలా ఆలస్యమయింది. అందుకని ఆలస్యంగా నిద్ర లేచాను."

"ఫరవాలేదు." అని విశ్వనాధంగారు మనసులో" ఏంపార్టీయో!' అని ఆశ్చర్య పోయాడు.

అతను వచ్చి ఆయన వద్దకూచుని, కబుర్లు చెప్ప నారంభించాడు. అతని కోసం వస్తున్న మనుషులతో కొంచెంసేపు. మధ్యలో, మాట్లాడుతూ మళ్ళీ విశ్వనాధంగారితో కంపెనీ విషయాలు మాట్లాడు తున్నాడు. ఆ బ్రాంచిలో, అక్కౌంటెంటూ, కాషియారూ, ఇన్‌ఛార్జీ, చంద్రశేఖరమే మరొక గుమాస్తాని అసిస్టెంటుగానూ, ఒక నౌకరునీ అతనికి ఇచ్చారు.

విశ్వనాధంగారు ఆడిట్ చెయ్యడంకోసం అక్కౌంట్ పుస్తకాలూ,బిల్లులూ,వోచర్లూ, అన్నీ తియ్యమంటున్నాడు. చంద్రశేఖరం అలా గేసంటూ ఏవోకబుర్లు చెప్తూ పన్నెండు గంటలదాకా కాలక్షేపం చేశాడు

ఆయన చూసిన పుస్తకాల్లో కొన్ని విషయాలు ఆయనకి ఆశ్చర్యం కలిగించాయి. ఆ విషయాలు ఆరునెలల క్రింద జరిగిన ఆడిట్‌లోనే బయటకి రావలసినవి. కానీ, రాలేదు.

ఆయన చాలా సరదాగా కబుర్లు చెప్తారు. ఎప్పుడూ నవ్వుతూనే వుంటారు. కానీ ఆ నవ్వు, బాగా పదును పెట్టబడిన కత్తి యొక్క మెరుపు లాంటిది. ఆయనే గనుక జడ్జీ అయితే ఆ నవ్వునిబట్టి ముద్దాయికి పడే శిక్ష ఊహించవచ్చు) ఆయన చిరునవ్వు నవ్వితే రెండేళ్ళు కఠినశిక్ష ఆయన బాగా నవ్వితే యావజ్జీవిత ఖైదు, పగలబడి నవ్వితే (గబ్బర్ సింగులాగా) మూడు బుర్రలు రపేమని ఎగిరిపోయే అవకాశముంది.

అలాంటిది ఆయన నవ్వు! చంద్రానికి, కొంచెం తెలుసుగాని, ఆ నవ్వు సంగతి పూర్తిగా తెలియదు. అయినా విశ్వనాధంగారు అకౌంటు పుస్తకాలలో కనుక్కునే విషయాలు రిపోర్టులో కెక్కకుండా చూడవలసిన అవసరం వుంది అతనికి.

అందుకు ఇలా ఆడిట్‌కి వచ్చేవాళ్ళమీద కొన్ని అస్త్రాలు, అవసరాన్నిబట్టి ప్రయోగించి లోబరుచుకుంటాడు చంద్రం.

ముందరొక 'వాయువ్యాస్త్రాన్ని' ప్రయోగిస్తాడు. అంటే అతిధి మర్యాదలూ, మంచి డిన్నరూ, తిరిగివెళ్లేటపుడు పళ్ళూ, ఫలాలూ, స్వీట్సూ-వీట్లతో ఆ వ్యక్తి అదరకొట్టబడి రిపోర్టు అతనికి అనుకూలంగా రాసేస్తాడు.

అది పనిచెయ్యకపోతే వారుణాస్త్రం - అంటే 'వాట్ 69', 'షివాస్ రిగల్' లాంటివి ప్రయోగిస్తాడు. అదీపన్జెయ్యకపోతే 'సమ్మోహనాస్త్రం' వుండనే వుంది- మోహనాంగి అనే పద్దెనిమిదేళ్లపడుచు ఈ అస్త్రం తప్పించుకుంటే, ఆఖరి బ్రహ్మాస్త్రం.(అంటే రెడీక్యాషు) ప్రయోగిస్తాడు. దానికి, ఆఖరికి ఆంజనేయుడైనా కట్టుబడాల్సిందే.

సాయంకాలందాకా పుస్తకాలు చూస్తూనే సినిమాకబుర్లూ. హోటల్‌కబుర్లూ, పేంక పీసీ,ఇసకవీధి కబుర్లు చెప్తూనే వున్నారు విశ్వనాధంగారు. ఆయన మాటల్ని బట్టి, ఆయన సమ్మోహనాస్త్రానికి లొంగిపోతారని చంద్రం విశ్వసించాడు.

ఆయన అలవాటు, కుర్రాళ్ళతో అలా కబుర్లు నవ్వుతూ,చెప్పడం. అంతేగాని అవి కావాలని ఆయన వుద్దేశం కాదు.

ఎవరోవ్యాపారస్థులు కొందరు వచ్చి, చంద్రాన్ని పైకి తీసికెళ్ళి, మెల్లిగా మాట్లాడివెళ్ళి పోయారు. వాళ్ళు పిలిచి నప్పుడు చంద్రంవెళ్లడానికి జంకితే, విశ్వనాధంగారు, "నాగురించి నువ్వు వ్యాపారం మానవద్దు" అన్నారు! అంటే - ఆడిట్ జరుగుతోందని వ్యాపారం ఆపవద్దు, అని ఆయన వుద్దేశం.

చంద్రం మరొకలా అర్థం చేసుకున్నాడు. 'నీ వ్యాపారం నాకూ ఇష్టమే' అని ఆయన అంటున్నాడని అనుకున్నాడు. బర్న్ అండ్‌కో,



అనేక కంట్రోలు పదార్థాల వ్యాపారం చేస్తుంది. సిమెంటూ. సోడాయాష్ మొదలైనవాటికి ఆ కంపెనీ ఏజన్సీ తీసుకుంది. వాటిని పర్మిట్లున్న వాళ్లకే అమ్మాలిగాని నల్లబజారులో అమ్మకూడదని ఆ 'కంపెనీ రూలు.'

మధ్యాహ్నం వాయువ్యాస్త్రం, సాయంకాలం వారుణాస్త్రం ప్రయోగించి చూశాడు చంద్రం. అవేవీ విశ్వనాథాన్ని లొంగదీసినట్లు లేవు. చిరునవ్వు నవ్వుతూనే విశ్వనాథంగారు రెండు పెగ్గులు పుచ్చుకుని 'నా 'లిమిట్' ఇంతేనోయ్' అన్నారు. రాత్రి తొమ్మిదింటి దాకా 'కంపెనీ' కోసం వచ్చిన మరో ఇద్దరు వ్యాపారస్థులతో చిరునవ్వు వదలకుండా మాట్లాడుతునే వున్నారు.

కానీ 'మీకేం భయంలేదు. నా రిపోర్టు నీ ఇష్టంవచ్చినట్లు రాస్తాను' అని అనలేదు.

ఇక సమ్మోహనాస్త్రం ప్రయోగించాల్సిందేనని నిశ్చయించాడు చంద్రం.

ఆ సమ్మోహనాస్త్రం, ఆవూళ్ళో చాలా ఎక్కువ రేటు పుచ్చుకునే, కొద్దిమందిలో, ఒక్కర్తి. తనగదిలోకి ఆమె ప్రవేశించగానే విశ్వనాథానికి కళ్ళు మిరుమిట్లు గొల్పాయి. 'ఎవరికోసం?' అని అడిగితే, 'మీకోసమే చంద్రంగారు పంపారు.' అంది, తెల్లని పట్టుచీరలో మెరిసిపోతూ

ముందర ఆమెని చూసి, ఆశ్చర్యపోయినా తరువాత చిరునవ్వుతో ఆహ్వానించి, మెల్లగా వివరాలు కనుక్కున్నాడు, విశ్వనాథంగారు.

## మోహనాస్త్రం

ఒక్కరాత్రికి మూడువందలు పుచ్చుకుంటుందట. ఆ రాత్రి డబ్బు చంద్రం, ఆమెకు ముందరే ముట్టచెప్పాడట. 'నా స్నేహితుడి ఆనందమే నా ఆనందం.' అన్నాడట.

ఎదురుగావున్నా కుర్చీమీద కూర్చున్న మనిషి, ఎలా వచ్చి తన ప్రక్కన కూచుందో అతనికే తెలియదు ఆమె జడలోని పూల పరిమళం, వంటి మీదనుంచి వస్తున్న సెంటు వాసనా, అందమయిన ఆమె విగ్రహం చక్కని కను ముక్కుతీరు, కొంచెం అతణ్ణి అల్లరి పెట్టేయి. అతని మాటలకు జవాబు చెప్తూనే, అతని వంటికి తన జబ్బలూ, రొమ్మూ తగిలించింది.

మరొకడయితే, మోహంతో పరవశమై అయస్కాంతాన్ని ఇనుము అతుక్కున్నట్లు, ఆమెను అతుక్కు సుండేవాడు.

కానీ, విశ్వనాథం ఇనుము కాదు ఆమెని అతుక్కోకపోగా, కొంచెం ఆమెకు దూరంగా జరిగాడు.

"పాలు పుచ్చుకుంటారా?" అంది వయ్యారంగా, జారిపోతున్న పైటని, సర్దుకునే నెపంతో మరింత జారేస్తూ. అక్కర్లేదన్నాడు.

"ఇది, ఇది?", అంది. 'బాటిల్'ని చూపిస్తూ, వద్దని తలూపాడు.

"మరింకా ఏం కావాలి?" అతని వైపు ఒక తమాషా చూపు విసిరింది ఆ చూపుతోనే, మేనక విశ్వామిత్రుణ్ణి తపస్సు నుంచి లేవగొట్టి వుంటుంది; మోహిని భస్మాసురుణ్ణి వెర్రివాణ్ణి చేసుంటుంది.

ఆ చూపుకు చలించని మహానుభావుడేం కాదు విశ్వనాథం. అతని ఒళ్లు జలదరించింది

ఒకసారి బాత్‌రూములోకి వెళ్ళి మొహం మీద చన్నీళ్ళు కొట్టుకుని వచ్చాడు. అతని చర్యను గమనించి మనసులో నవ్వుకుంది. తువ్వాలందిచ్చే నెపంతో అతని చెయ్యి పట్టుకుంది.

సున్నితంగా చెయ్యిని విడిపించుకుని "నీతో మాట్లాడాలి కూచో!" అని ఆమెను కూర్చోపెట్టాడు. అతని వంటిని ఎగాదిగా చూసింది. తను అతని శరీరాన్ని జయించింది. విశ్వనాథం వయస్సు కొంచెం తక్కువై వుంటే, తన గెలుపు స్థిరమైనదే అని నమ్మేది. కాని అతని వయస్సు ముప్ఫై అయిదు, అందుకని తను అతని మనస్సుని గెలిచిందో లేదో అనుమానమే!

మరొక్కసారి ప్రయత్నించాలి. "ఊం! ఏం మాట్లాడుతారు. చెప్పండి" అంది మత్తుగా చూస్తూ.

అతనూ ఆమెవైపు తీక్షణంగా మాట్లాడకుండా ఒక నిముషం చూసి, "లాభంలేదు" అన్నాడు.

"అంటే?"

"నువ్వు వెళ్ళిపో"

"ఏం? నేను మీకు నచ్చలేదా?" అంది తన కళ్ళల్లో ఆశ్చర్యం ప్రకటిస్తూ.

"అదికాదు నువ్వు నచ్చకపోలేదు. నేను దానికి అతీతుణ్ణి కాదు కాని ఇప్పుడు లాభం లేదు"

"డబ్బు ఆయన ఇచ్చేశారు" అంది కొంచెం నిర్లక్ష్యంగా.

"ఆ డబ్బు అతనికి తిరిగి ఇచ్చేసెయ్యి"

ఈసారి ఆమెకి భయమేసింది. ఎప్పుడూ ఇలాంటి ఓటమి తన కెదురవలేదు, ఆమె భయం చూసి విశ్వనాథం, చిరు నవ్వుతో కబుర్లు చెబుతూ మెల్లగా ఆమెని బయటకి పంపదల్చాడు మరొక పది నిముషాలకి, ఆమె మామూలు మనిషై బయటికి వచ్చేసింది.

వచ్చేముందు, అతన్ని ఒక్క ప్రశ్నవేసింది. "మిమ్మల్ని నేను కదల్చలేక పోయానా?" అంది.

అతను చిరునవ్వుతో, "కదల్చావు. నా



శరీరం ఎలా నీ కోసం దూకబోయిందో నువ్వు గుర్తించావు. కానీ, నా మనసు ఈ సందర్భంలో నిన్ను స్వీకరించలేదు" అన్నాడు.

"అంటే మీమనస్సుకు, శరీరం మీద అంత కంట్రోలు వుందా?"

"నువ్వే చూశావుగా!"

ఆమె మెల్లగా ఆలోచిస్తూ వెళ్ళిపోయింది.

ఆ తరువాత, విశ్వనాథం ఆడిట్ రిపోర్టు చందాన్ని ఉద్యోగంలోంచి తొలగేటట్లు చేసింది పదివేలకు పైగా కంపెనీడబ్బు దుర్వినియోగం చేశాడు చంద్రం. ఆడబ్బు చాలా వరకూ అతని బావమరిది కట్టుకున్నాడు.

ఆ సందర్భంలో కలిసిన యువతిలా వుంది ఈ ఎదురుగా బెంచీమీద కూర్చున్న స్త్రీ. ఆమెకు పెళ్లయి వుంటుందా? ఒకవేళ అయితే, ఆమెగతం ఆమెను వెన్నాడకుండా వుంటుందా. ఆమె భర్తకూ, ఆమెబిడ్డలకూ సంఘంలో గౌరవం వుంటుందా?...అని ఆలోచించాడు.

చిన్నప్పుడు తన క్లాసుమేటుకు రవావొక డుండేవాడు వాడిపేరు అనంతం. వాడితల్లి, ఒక వేశ్యఅని అందరూ చెప్పుకునేవారు. తెలుగుటీచరు వాడిని 'నానావీజరత్నాకరుడు' అని ఒకసారి వేళాకోళం చేసే, వాడెంతో బాధపడ్డాడు. వాణ్ణి అప్పుడప్పుడు లోటి క్కురాళు ఏడిపిస్తుంటే తనకు జాలేసింది. కాని వాడు చాలా తెలివైనవాడు. ఒక గ్రాడ్యు యేటుని రెండేండ్ల క్రితం వివాహం చేసు కున్నాడని తెలిసింది.

రైలు పలాసా దాటింది.

అంతవరకూ ఆమెను పలకరిద్దామా వద్దా అని ఆలోచిస్తూ గడిపాను. కానీ, ఈమె ఎవరిని వివాహం చేసుకుందా? అని అతని మనసులో కుతూహలం బయల్దేరింది. ఆమె గతాన్ని దాచినా దాగదు.

మరి అటువంటి స్త్రీని ఏలాటి వాడు పరిగ్రహిస్తాడు? ఒకవేళ ఆమె గతం గురించి తను చెప్పాలసి వస్తే? అక్కౌంట్ పుస్తకాల్ని ఆడిట్ చేసినట్టే మనుషుల జీవితాల్ని ఆడిట్ చేస్తే, ఏలాటి నిజాలు బయట పడ తాయో ?

బహుశా, తన గతం గురించి చెప్పి, 'నీ కుంటివాణ్ణో, గుడ్డివాణ్ణో, నీకు జీవితాంతం తోడుగా వుంటాను', అని పెళ్ళి చేసుకుందా? అసలా వృత్తిని ఏలా వదలింది? ఎందుకు వదిలింది? ఆ వృత్తి మీద అసహ్యంచేత వదిలేసిందా? ఈ ప్రశ్నలకు జవాబు తెలుసుకోకుండా ఏలా వుండగలడు తను? -

ఆమె కలంకటు తను మాటాడలేదుగాని, విశ్వనాథం మాటలు కలిపేశాడు ఆమె రైలు కిటికీని మూయ్యాలని ప్రయత్నించి అవస్థపడు తూంటే, అతను సాయంచేసి ఆ సందర్భంలో "మిమ్మల్నెక్కడో చూసినట్లుంది" అన్నాడు.

ఆమె నవ్వింది. "అవును చూశారు అంతే కాదు మిమ్మల్ని నే నెప్పుడూ మర్చిపోలేను" అంది.

విశ్వనాథం చిరునవ్వు నవ్వాడు. "అయితే అప్పటికీ, ఇప్పటికీ చాలా మార్పొచ్చింది" అన్నాడు.

తరువాత బరంపురం వచ్చేదాకా ఇద్దరూ ఆ కబురూ, ఈ కబురూ మాట్లాడు కున్నారు తనని కలిసిన దగ్గర్నుంచీ, ఆమెకు ఆ వృత్తి మీద ఏవగింపు కలిగిందట ఎందుకో చెప్పలేదు గాని మంచితనం మీద తనకు నమ్మకం కలిగించినది విశ్వనాథమేనట! ఈ ప్రపంచంలో మగాళ్ళంతా అవినీతిపరులే అనుకునేదట అంతకుముందు కాని ఒక రకమైన నీతికి కట్టుబడి, విశ్వనాథం, ఆ రాత్రి అలా ప్రవర్తించడం తనలో గొప్పమార్పు తెచ్చిందిట. అప్పటినుంచీ,తిండి లేక మాడినా సరే, డబ్బుకు ఒళ్ళు అమ్మకో కూడదని నిశ్చయించిందిట,

వివాహం సంగతికూడా తనే చెప్పింది. ఎవరో దూరపుబంధువైన యువకుడు, తనని చిన్నప్పటినుంచీ ప్రేమించేవాడుట. అతని మీద నిర్లక్ష్యం కొద్దీ, తను చెడుదారిని పట్టిందిట. కానీ, తనావృత్తిని వదిలేసిందని తెలియగానే, అతనువచ్చి పెళ్ళిచేసుకో మన్నాడట. పెళ్లిచేసుకుందిట.

కొంచెంసేపు కళ్ళుమూసుకొని, ఆ భర్త ఏలాటివాడోనని ఆలోచించాడు. బాగ వయసు మళ్ళినవాడేమో! లేకపోతే వాడికి ప్రతిరోజూ భార్యగతం గుర్తుకువచ్చి, బాధకలగదూ? ఏమైనా, ఈమెకన్నాచాలా ఉదారహృదయుడై వుండాలి. - అనుకొన్నాడు.

బరంపురం స్టేషనులో ఆమెభర్త, ఆమెని 'రిసీవ్' చేసుకోడానికి వచ్చాడు అతను చాలా అందంగా, దర్జాగా, మంచి పెర్సనాలిటీలో, ఠీవిగా పోలీసుయూనిఫారంలోవున్నాడు .నలభై ఏళ్ల వాడిలా వున్నాడు. అతినిని చూడగానే విశ్వనాథం చిరునవ్వు నవ్వుకున్నాడు. అతను కూడా విశ్వనాథాన్ని చూశాడు.

"హల్లో! విశ్వనాథం ఏక్కడిదాకా?"



"ఇక్కడికే, ధ దపురం వెళ్తున్నాను."

ఆమె పొగాన్ని ఒక జవాబు పుచ్చుకున్నాడు ఆమె లేచి వెళ్ళి, కంపార్టుమెంటు దిగింది.

"ఈమె నా వైఫ్" అన్నాడామె భర్త.

"అలాగా. ఇంతసేపూ, ఆమెతో మాట్లాడానేగాని, ఈమె నీ మిసెస్ అని తెలియదు"

"నా పెళ్ళికి కూడా రాలేదు ఇక్కడ దిగి నా యింటికి రాకూడదూ?"

"తరువాత వస్తా, ఇప్పుడు పనుంది."

"తప్పకుండా రావాలి, అన్నయ్యగారూ!" అంది ఆమె. విశ్వనాథం చిరునవ్వు నవ్వుతూ, "మీ ఆయనా, నేనూ చిన్ననాటి నుంచీ స్నేహితులం. నేను రాకపోతే, వాడు నన్ను అరెస్టయినా చేసి తీసుకెళ్తాడు" అన్నాడు

ముగ్గురూ నవ్వారు

మెయిల్ కదిలింది. "వస్తా లేరా!అనంతం! నిన్ను చూసి చాలాకాలమైంది" అన్నాడు విశ్వనాథం.

వాళ్ళు అతనికి వీడ్కోలిస్తూ చేతులూపారు, రైలు వేగం పుంజుకునేదాకా. వాళ్ళూ, వాళ్ల వూరూ కనుమరుగయ్యాక నిట్టూర్చాడు విశ్వనాథం.

తన చిన్ననాటి స్నేహితుడు అనంతమే ఆమె భర్త అవుతాడని ఎలా వూహించగలడు! అయితే అనంతం ఆమెనన్నీ తెలుసుకునే వివాహం చేసుకున్నాడన్నమాట!

ఒక స్త్రీ, తప్పుదారిలోంచి, మంచిదారి లోకి పోవడానికి, తనుగూడా కారణభూతుడైనందుకు విశ్వనాథం సంతోషించాడు ఒక నిముషంలో తను చూపించిన నిగ్రహం,

ఎంతమంది జీవితాల్ని మార్చేసిందో!

బహుశా ఆ పరిస్థితుల్లో కాక, మరొక రకమైన పరిస్థితులలో కలుసుకొని వుంటే, తను, ఆ నిగ్రహం చూపివుండేవాడు కాదు.

## మోహనాస్త్రం

అయితే, తనేమీ కాంతా కనకాలకు అతీతుడు కాదు. తనూ అందరి లాటి వాడే.

కానీ మనసు తోడ్పడందే, శరీరం ఏమీ చెయ్యలేదు. మనిషి ప్రవర్తన, నీతి అనేది ఒక ఆనకట్ట లాంటిది అనుకుని చిరునవ్వు నవ్వుతున్నాడు విశ్వనాథం.

# సామాన్యుని సణుగుడు

## హస్త లాఘవం

మద్రాసు మహానగరంలో యీ మధ్య సోఫిస్టికేషన్ ఎక్కువైపోయిందిట ?! బస్సులలో మంచి అందమైన అమ్మాయిలు మగధీరులను తాకడం రాసుకుంటూ పోడం చేస్తున్నారట? — అని వో మిత్రుణ్ణి అడిగాను.

"ఆ! ఆ! రాసుకుంటూ పోతూనే వున్నారు. ఆ సుందరాంగన అటు పోంగానే యిటు చూసుకుంటే మన జేబు ఖాళీ" అన్నాడు. "అంటే అమ్మాయిలు జేబులు కత్తిరించేస్తున్నారా ?"

"ఆహా! నిస్సంకోచంగా! జేబులు కత్తిరించడమే కాదు- టిఫిన్ డబ్బాలు, షాపింగు బుట్టలు పట్టుకుపోతారు కూడా" అన్నాడు. ఈ విషయం వార్తాపత్రికలు వేశాయికూడా" "ఈ సంగతి బస్ కండక్టర్‌కు డ్రయివర్‌కు చెప్తే ? అలాంటి వాళ్ళమీద వో కన్ను వేసుంచరా ?" అన్నాను... వార్తాపత్రికల్లో యీ వైనం చదివినట్లు గుర్తుకొచ్చి "వాళ్లేం వేస్తారు వీళ్లమీదకన్ను ... ఏ డ్రయివరైనా కండక్టరైనా 'అదుగో ఆ మహాతల్లియే అమిత లాఘవంగా జేబులు కత్తిరించేస్తోంది' అంటే ఆ అమ్మాయి వెనుక వున్న గ్యాంగు వురుకుంటుందా ? ఈ డ్రయివరు కండక్టర్‌ల మీద కన్నేస్తుంది ..." అన్నాడు.

మద్రాసులోనే గాదు ఎక్కడయినా వుంది పరిస్థితి. రద్దీగావున్న నగరాలలో హైదాబాద్‌లో వుందేమో బెజవాడలో మాత్రం ఆడ పిక్‌పాకెట్‌లు లేరు.

దీనివల్ల గుణపాఠం ఏమి ? అతివలయినా మనం మాత్రం కక్కుర్తిపడి వాళ్ల చెయ్యో కాలో మనకి తగలాలనే ప్రలోభానికి లోను కాకూడదు ... అందులోకి సిటీబస్‌లలోను సినిమా హాలు క్యూల దగ్గర "బహుపరాక్!" అని బస్సు డిపోలలోను రైలు స్టేషన్‌లలోను-"ఆపరేట్" చేసే గ్యాంగులు బస్సుల వాళ్లకి రైల్వేవాళ్లకి తెలియకుండా ఎలా "ఆపరేట్" చేయగలరు ?! పోలీసులు తల్చుకుంటే క్షణాల మీద జేబులో నుంచి జారిపోయిన పర్స్ సురక్షితంగా తిరిగి వస్తుంది" - దొంగ లెవరో పోలీసులకి తెలియకపోతే యింకెందుకండీ యీ పాడు ప్రపంచం ?! బైదిబై ఓ "పిట్టకథ" మద్రాసులో పది పదకొండేళ్లనాటి మాట లెండి. ఓ సౌకర్యం వుండేది సినిమా హాళ్ళ దగ్గర పెద్ద పెద్ద క్యూలుంటాయి. కాని ఆడవాళ్ళకి "అప్పర్ క్లాసు" బుకింగ్‌ల దగ్గర-యింగ్లీష్ — హిందీ బైస్కోపులకైతే అంత ఆదరద్దీ వుండేదికాదు. మనం చూసేవి అవేగా...

మనం నిరాశా నిస్పృహలతో క్యూలో కొసని నిలబడితే — ఆపద్బాంధవి లాగ వో అప్టుడేట్‌గా వున్న అమ్మాయి పలకరించేది — అది యింగ్లీష్‌లో... "కెన్ ఐ గెట్ ఎ టికెట్ ఫర్ యూ అండ్ ఆల్సోఫర్‌మీ" అని మొదటి వాక్యం గట్టిగా తరువాతి క్లాజు మెత్తగా అనేది. అంటే మనం అర్థం చేసుకోవాలి. టిక్కెట్ వెల రెట్టింపు అని - అయితే బ్లాకులో కొనుక్కున్నేకన్నా నయం గదా ... పైగా "స్వీట్ కంపెనీ" అందుకని మనం రెండు టిక్కెట్‌ల "పైకం" యిస్తాం ఆ అమ్మాయి తనకోటి మనకోటి టిక్కెట్ తెచ్చి మనతో సినిమా చూస్తుంది — అంతే టిక్కెట్ ఋణానుబంధం — హాల్లో కూడా మన వూసెత్తదు యువతి — వికారాలుంటే మన దగ్గర మనమే ఆమె వూసెత్తితే తప్ప [పర్యవసానం స్వానుభవం కాదుగనుక 'తెల్దు'.]

ఆడవాళ్ళకున్న "ఎడ్వాంటేజెస్"లో యిది ఒకటి-అయితే సభ్య ప్రపంచంలో నైతేనే... అవతలి అమ్మాయి కూడా తనకి టిక్కెట్ కొనేవాణ్ని బహు జాగ్రత్తగా సైకాలజీ ఎక్స్‌పర్ట్ లాగా ఎన్నుకుంటుంది! మరి యివాళ రేపు మద్రాసు సంగతి మనకి తెలియదు గాని మనం గూడా జాగ్రత్తగానే వుండాలి. ఇంతకీ చెప్పవచ్చేది ఏమిటంటే 'జేబులు జాగ్రత్త' అన్న రూలు బస్సులలో రైళ్లలోను స్త్రీల విషయంలోను పురుషుల విషయంలోనూ — ఒకటేనన్నది మనం గ్రహించాలి అని మాత్రమే ...

[ వి రా జీ ]

# సంక్షిప్త రామాయణం

— కేవన శర్మ




## 5. రామనాధం తన శకటమును గాల్చుట

ఎల్లాగైతేనేం తిప్పలు పడగా, పడగా ఆ రాష్ట్ర ప్రభుత్వం వారు తెలుగు సమితికి చీమలపేటలో ఒక చిన్న స్థలం విద్యాలయ భవన నిర్మాణానికి గాను 50 సంవత్సరాల లీజ్ మీదిచ్చారు. విద్యాలయం అన్న పదానికి చేతనైనంత విశాలంగా అర్థం చెప్పుకోవచ్చు అని కూడా అన్నారు. అర్ధరాత్రిపూట అక్కడ అయిదుగురు పిల్లలకి తెలుగు నేర్పినా అది విద్యాలయమే! అందుకని తెలుగు సమితికి తక్షణ కర్తవ్యం భవననిర్మాణం అయింది.

ఆ క్రితం సంవత్సరం వేసిన సినిమాల లెక్కలు, సావనీర్ అచ్చేసినదాని లెక్కాజమా అన్నీ ఆడిట్ చేయించి పంపమని సమితుల రిజిస్ట్రార్ నోటీసు లివ్వటం మొదలు పెట్టాడు. కొందరు డబ్బులివ్వలేదు. కొందరు టికెట్ల పుస్తకాలు తీసుకొన్నవారు పుస్తకాలు ఇవ్వలేదు. కాని అందరు పెద్ద వాళ్లే! "వచ్చేవారం ఇస్తాం. ఆ పుస్తకాలు మరొకళ్ళకిచ్చాం. ముందరేమో అమ్మి పెట్టండి అని బతిమాలారు. ఇప్పుడేమో పీకలమీద కూర్చుంటారు. ఇస్తాక పారిపోతామా" అన్నారు. అందులో పోలిసాఫీసర్లు ఇన్‌కమ్‌టాక్సువాళ్లు రకరకాల ప్రభుత్వోద్యోగులున్నారు. రెడ్డికి తల వాచిపోయింది. రంగారావు నిర్లిప్తంగా వూరుకొన్నాడు. "ఇల్లాంటి చిన్న విషయాల గురించి బాధపడ్తే అయినట్టే. నోటీసులిచ్చి ఇచ్చి ఆ రిజిస్ట్రారే ఊరుకొంటాడు. మన భవన నిర్మాణ కార్యక్రమం గురించి ఆలోచించండి" అన్నాడు సుబ్బారావు.

"మీ సలహా ఏమిటి?" అని అడిగించుకొని సుబ్బారావు చెప్పాడు.

"సినిమాల్లో పైకి రావటానికి తిప్పలు పడ్తున్న నటులు నాటక సమాజాలు పెట్టుకొని భుక్తి గడుపుకొంటూ ఉంటారు. వాళ్ళు ఏ రోజు తిండి ఆ రోజు వెతుక్కోవలసిన వాళ్ళు. వాళ్లకి దారిఖర్చులు తిండి ఖర్చులు ఇస్తే వచ్చి నాటకం వేసిపోతారు. వాళ్లకి మూడోతరగతి టికెట్లు కొనిస్తే చాలు. సినిమా వాళ్ళంటే ప్రజలకి చాలా గ్లామర్ ఉంది. అటువంటి నాటకం ఒకటి వేయించి టికెట్లమ్ముకుందాం. ఓ అయిదారు వేలు లాభం వస్తుంది. పూర్వం వచ్చిన ఎనిమిదివేలున్నాయి. పైగా జీవిత సభ్యులిచ్చిన చందాల్లో ఇంకా పదిహేనువందల దాకా మిగిలింది. పదిహేనువేలతో ముందర ఓ షెడ్డు లాంటిది వేసుకోవచ్చు" అన్నాడు.

ఏర్పాట్లు బ్రహ్మాండంగా సాగిపోతున్నాయి. పబ్లిసిటీ ఘనంగా ఇచ్చారు. పోస్టర్లంటించారు. ప్రకటనిచ్చారు స్కూటర్లమీద, కార్ల మీద తిరిగి టికెట్లమ్మారు. హడావిడి పడ్డారు ట్రంకాల్స్ చేసారు. బిల్లులు పోగేసారు. పద్మావతీదేవి రామనాధం కార్లో తిరిగి వందరూపాయల పెట్రోలు తగలేసి డెబ్భైయిఅయిదు రూపాయల టికెట్లమ్మింది. దానికి కూడా రామనాధం కట్టుకున్నాడు. అతను తన కారుకి టైర్లూడదీసి జాకీల మీద మోపుచేయడం తరువాత జరిగింది. మద్రాసు నుంచి సినీ కళాకారుల నాటక బృందం వచ్చాక జరిగింది.

రైలు స్టేషన్లో దిగుతూనే "మేం కాన్డబ్బు తీసుకోకుండా నాటకం వేస్తున్నందుకైన ఫస్టుక్లాసు ఛార్జీలివ్వచ్చుగా. ఈ మూడో తరగతి ప్రయాణం వొళ్ళంతా నొప్పులు. కాఫీ టిఫిన్లయ్యాక, మమ్మల్ని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళండి. కాస్త పెద్దడాక్టరు దగ్గరకి" అన్నారు.

"మేము ఉత్తపుణ్యానికి నాటకం వేస్తున్నాంకదా కాస్త మమ్మల్ని మంచి లాడ్జింగ్‌లో దింపచ్చు కదా"

"ఫ్రీగా నాటకం వేయించుకొంటున్నారు కదా, ఈ సాంబారు భోజనం కాక కాస్త మంచి భోజనం పెట్టకూడదూ."

"వెంగన్నారావు గారూ ఈ చొక్కాని ఇస్త్రీ చేయించి తీసుకురండి."

"రంగారావుగారు మంగలాడిని పిలిపించి గడ్డం చేయించాలి మీరు నాకు."

"రెడ్డిగారు కంగారులో నేను సరియైన చీర తెచ్చుకోలేదు. మీ ఆవిడ నడిగి కాస్త అయిదువేళ్ళ వెడల్పు జరీ ఉన్న పట్టుచీర పట్టుకువస్తారూ."

"రామనాధంగారూ! రేపు మీ కార్లో మాకు, ఊరు చూపించాలి."

అంటూ ఊదరగొట్టేసారు. డాక్టర్దగ్గరకు వెళ్ళడానికి, మంగల్ని పిలవడానికి రామనాథం కారు వాడుకొన్నారు. సుబ్బారావు దగ్గర, పద్మావతిదేవి దగ్గర వాళ్ల పప్పులుడకలేదు. మర్నాడు ఊరంతా కార్లో తిరిగారు ఆ కారు రామనాధంది.

"ఎల్లాగో ఇంతదూరం వచ్చాం. ఈ చుట్టుపక్కల చూడదగ్గ ప్రదేశాలు చూసేసి పోతాం. ఏమంటారు రామనాధంగారు" అంటూ కబురు పెట్టారు. అప్పటికే రామ

...కారు అక్కడయిపోయింది. రామనాథం జాకీమీద కారెత్తి చక్రాలూడబీకి చక్రాలు దాచేశాడు. ఆ విధంగా తన శకటాన్ని నేల కూల్చి "కారు పాడైంది" అని కబురు పెట్టాడు.

సుబ్బారావుతో నటులు "మరో కారు కావాలి" అంటే "వెధవ్వేషాలు వెయ్యక రైలెక్కండి" అన్నారు. ఆ విధంగా వాళ్ళని రైలెక్కించి లెక్కలు చూసుకొంటే ఖర్చు అయిదువేలు. ఆదాయం నాలుగువేలు తేలింది.

"ఈ సమితి కనక మరోసారి ఉచితంగా ప్రదర్శన ఇస్తాం అన్నవాళ్ళతో ప్రదర్శన ఏర్పాటుచేస్తే నేను రాజీనామా ఇస్తాను" అన్నాడు రంగారావు.

ఫిక్సుడ్ డిపాజిట్‌లో ఎనిమిది వేలు కాకుండా జీవిత సభ్యుల చందాలో అయిదు వందలు సుబ్బారావు దగ్గర మిగిలింది. అది తెలుగుసమితి ఆర్థిక పరిస్థితి నాటక ప్రదర్శన పూర్వ్యోసరికి.

(ఇంకా వుంది)

## * అవీ - ఇవీ - అన్నీ *

### మా తెలుగుతల్లి

తెలుగువారి జాతీయ గీతం 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' పై విపులంగా వివరంగా 'పిరంచి'గారు వ్రాసిన పరిశోధనా గ్రంథం మా కార్యాలయం చేరింది. 43 పేజీల ఈ గ్రంథం వెల 116 పైసలు. ప్రచురణ: పిరంచి కావ్యాభిమాన సంఘము, సదాశివపేట, [మెదక్ జిల్లా]

### నవభారతం

ప్రధాని 20 సూత్రాల పథకం ఆధారంగా రచించిన సాంఘిక నాటకం రచన: విద్వాన్ గొర్రె కొండ చిన్ని కృష్ణశర్మ 172 పేజీలు, వెల 6 రూపాయలు, ప్రతులకు: సాహిత్యశ్రీ రాజరాజేశ్వరి పబ్లికేషన్స్, సామర్లపురం, ప్రకాశం జిల్లా.

### అందిన చివుళ్ళు

శ్రీమతి నిడమోలు ప్రసన్నగారు వివిధ అంశాలపై సరళంగా వ్రాసిన వ్యాస సంపుటం. మా కార్యాలయం చేరింది. భాషా కుటీరంవారు అనుపమ పుష్టంగా వెలువరించిన యీ పుస్తకం వెల 3 రూపాయలు. ప్రతులకు భాషా కుటీరం, 3—5—1095/10, శిలాద్రి నారాయణగూడ, హైదరాబాదు—29కి వ్రాయాలి.

### సి. ఐ. ఎ. నిజస్వరూపం

రచన: హెచ్. డి. మాలవ్యా, ప్రచురణ: శాంతి స్నేహ సంఘీభావ సంఘం, విజయవాడశాఖ. మూల్యం 150 పైసలు. ప్రతులకు: ప్రగతి న్యూస్ ఏజన్సీ ఏలూరురోడ్, విజయవాడ—2 కి వ్రాయాలి.

### కాంతిరేఖలు

యువభారతిలోని రచనల 2 వ సంపుటి, సంకలనం: శ్రీ మన్నవ గిరిధరరావు, 130 పేజీలు, వెల నాలుగు రూపాయలు, ప్రచురణ యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ [రిజి], శ్రీకృష్ణనగర్, గుంటూరు—4.

### రథచక్రాలు

సాంఘిక నాటకం రచన: మిన్సుల్ కట్టా. 128 పేజీలు, వెల 5 రూపాయలు, ప్రచురణ ఆంధ్రభారతి బుక్ డిపో, తెనాలి—2.

11. 3-1977 శుక్రవారం మొదలు
17 3-1977 గురువారం వరకు

# వారఫలం
మహేంద్ర

**మేషం :—** లాభంరావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ప్రయాణాల్లో శ్రమకలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. రావలసినడబ్బు అందుతుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు —ఆరోగ్యం భాగుండదు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం :—** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం మధ్యలో శ్రమకలుగు తుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు చికాకులు ఏర్పడతాయి.

**మిధునం :—** వృత్తిలో పోటివారి పోటీ పెరుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. రావలసినడబ్బు అందగలదు. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో అనుకున్నంమైన శ్రమకలుగు తుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం :—** మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమకలుగు తుంది. పోటివారితో వాద ప్రతివాదాలు తగవు. వారం ఆఖరులో మీ ప్రయత్నాలు నెరవేరతాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం :—** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది, వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు — బంధుమిత్రులను కలుసుకొంటారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కన్య :—** అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలు వాయిదా పడతాయి. మీరుచేసే ప్రయత్నాలవల్ల ముమ్ముందు కూడా ఫలితం ఉంటుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన సమాచారం అందగలదు.

**తుల :—** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో పోటివారి పోటీ తగ్గుతుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయోజనంగల సంఘాలను జరుప గలరు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. పోటివారిలో గౌరవం లభించగలదు.

**ధనుస్సు :—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం బాగుంటుంది ప్రయాణాలు వాయిదా పడతాయి. రావలసినడబ్బు అందు తుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగు తుంది.

**మకరం :—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెలుసుకొంటారు వారం మధ్యలో శ్రమ కలుగు తుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం ఆఖరుతో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం :—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగు తుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో కొంత మంది వ్యక్తులు నిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. స్త్రీలకు — వ్యతిరేకమైన వార్తలను వింటారు. పుణ్యకార్యాలు నెరవేరతాయి.

**మీనం :—** అనుకూలమైన వార్తలను వింటారు. రావలసినడబ్బు అందుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మీ కంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసివస్తుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. విలాసవస్తువులు కొంటారు.

## అవీ - ఇవీ - అన్నీ

### గంగ పుట్టిన గడ్డ

నవల రచన : శ్రీమతి లత. 188 పేజీలు వెల 6 రూపాయలు. ప్రతులకు : శ్రీ దుర్గా బుక్ సెంటర్, ఏలూరు రోడ్డు, విజయవాడ 2.

### అలక

కథల సంపుటి : రచన కసిరెడ్డి కస్తూరి, ప్రచురణ : హితసాహితి, కామారెడ్డి, నిజామాబాదు జిల్లా. మూల్యము రు. 2—50, ప్రతులకు : కార్యదర్శి. హిత సాహితి, హెచ్. నెం 1—1—56, కామారెడ్డి, 503111, నిజామాబాదు జిల్లాకి వ్రాయవచ్చును.

### శ్రీదేవీ పూజ

అష్టోత్తర శత పద్య ప్రసూనములు; కృతికర్త విద్వాన్ బులుసు వెంకటేశ్వరులు, ఎం. ఏ. వెల : రూపాయి, ప్రతులకు : బులుసు వెంకటేశ్వరులు ఎం. ఏ., రామారావుపేట, కాకినాడ—4 కి వ్రాయవచ్చును.

### ఒంటరి జీవితం

కథల సంపుటి రచన : శ్రీ శిగిరిసెట్టి వెంకటేశ్వరరావు. 40 పేజీలు, వెల 2 రూపాయలు, ప్రతులకు : విజయ్ పబ్లికేషన్స్, ఉండవల్లి [పోస్టు], [వయా] తాడేపల్లి, గుంటూరు జిల్లా.

### మానవుడా - మేలుకో

మరియు జమ్మికుంట జగన్నాధుని స్తుతి గీతములు, రచన : శ్రీ కర్నె చిరంజీవి 36 పేజీలు, వెల రూపాయి, ప్రతులకు : శ్రీ ఆర్ దామోదర్, లక్ష్మీ వెంకటేశ్వర బుక్ సెల్లర్, జమ్మికుంట, హుజూరాబాద్ తాలూకా, కరీంనగరంజిల్లా.

### మనిషి

కథల సంపుటి : పురోగామి మూడవ ప్రచురణగా వెలువడిన ఈ పుస్తకంలో శ్రీయుతులు సత్యం మందపాటి, గొల్లపూడి, మారుతీరావు, పాలపర్తి వేణుగోపాల్, అవసరాల రామకృష్ణారావు, మోపిదేవి దుర్గాప్రసాదరావు, చామర్తి దుర్గాప్రసాద్, కుమారి ఇందిరగార్లు వ్రాసిన కథలు ఉన్నాయి. 96 పేజీలు, వెల నాలుగు రూపాయలు ప్రతులకు : శ్రీ ఎం. డి. పి రావు, డి. 10/15, 3వ క్రాస్ రోడ్, ఐ. ఐ. టి. క్వార్టర్స్ మదరాసు—600036

### దివిటీ

మినీ కవితల సంకలనం. రచన: త్రిమూర్తులు [నందిని, కందుకూరి, రాజు], 30 పేజీలు వెల రూపాయి, ప్రతులకు శ్రీ కె. బాలరాజు, రావురూకుల పోస్టు] సిద్దిపేట తాలూకా, మెదక్ జిల్లా.

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# క్రికెట్ ఆటకు విజయం

"శస్త్ర చికిత్స విజయవంతమైంది కాని రోగి దివంగతుడైనా"డన్నట్లు భారత జట్టు వరుసగా ఢిల్లీ, కలకత్తా, మద్రాసు టెస్టు పోటీలలో వోడిపోయిన తరువాత విజృంభించి బెంగుళూరు, బొంబాయిలలో యింగ్లాండును తిప్పలుపెట్టింది. "గ్రిగ్" జట్టు బెంగళూరులో వోటమిని చవిచూసి – దిగాలుపడిపోయి బొంబాయిలో కూడా 'చావు' తప్పి కన్ను లొట్టోయిందన్న రీతి ఆఖరి రోజు క్షణ క్షణ గండంగా ఆడి – "డ్రా" చేసింది. [అయితే యీ సీరీస్ విజయం వారిదే].

బొంబాయి టెస్టు పోటీ "నువ్వా నేనా ?" అన్నట్లు జరిగి అరవై వేలమంది ప్రేక్షకులకు ఉత్కంఠాభరితమైన ఆనందాన్ని యిచ్చింది... ఈ 'టెస్ట్'లో మనకి మరో "స్పిన్నర్" లభించాడు. "కేప్టెన్ ఘావ్రి"ని జట్టు కేప్టెన్ బేడీ స్పిన్నర్‌గా వాడుకొన్నాడు. ఘావ్రి ఎడంచేత్తో బంతులను బొంగరాల్లాగ త్రిప్పి వరసగా వికెట్‌లు లాక్కున్నాడు. క్రింది బొమ్మ బొంబాయి టెస్ట్‌లోనిది. ఫిబ్రవరి 11న గవాస్కర్ గ్రిగ్‌ని 'స్క్వేర్ కట్' చేసి బౌండరీ లైన్ దాటిన బంతిని గమనిస్తున్న దృశ్యం ... విజయమర్చంట్ అన్నట్లు బొంబాయి పోటీ "క్రికెట్ క్రీడా విజయం"! "గ్రిగ్" మంచి ఉత్సాహమున్న కేప్టెన్... ★
















# సీత గీత దాటితే

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: శ్రీధర్

నిర్వహణ: ఎ.పూర్ణచంద్రరావు

నిర్మాత: సి.పి.రెడ్డి

సంగీతం: కె.వి.మహదేవన్

లక్ష్మీ ఫిలింస్

Nandi